ఆడదె ఆధారం మన కథ ఆడనే ఆరంభం
ఆడదే సంతోషం మనిషికి ఆడదే సంతాపం

ఎ.వి.కె.రెడ్డి సమర్పించు పవన్ ఎంటర్‌ప్రైజెస్



# శ్రీమతి ఒక బహుమతి




శంకర్-గణేష్
ఆత్రేయ
సీతారామశాస్త్రి
ఎస్.బాలకృష్ణ

నిర్మాతలు దయాకర్ • కరుణాకర్

PAVAN PUBS

JAGATI Rs 2-00 December 1987

33rd Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

డిసెంబరు – 1987



'ఆయన ఇంట్లో లేడు'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరి రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24-00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: నాగిరెడ్డి

# నిమ్మతొనలు

గోపీ, నీకున్న ఏమైనా రెండు కోరికలు చెప్పారా? అడిగాడు గిరి.

'ఒక అందమైన అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకోవాలి'

'రెండవ కోరిక ?' ..

'ఆ తరువాత విడాకులివ్వాలి'

—కె నాగేశ్వరరావు

నరసారావుపేట

అతనేమిటి అంత కోపంగా స్త్రీల వైపు చూస్తూ పోతాడే ? స్త్రీలంటే కోపమా అతనికి? - అడిగాడు ప్రసాద్, శాస్త్రిని.

'అదేంకాదు అతనికి కోపం వచ్చినపుడు అందంగా ఉంటాడని ఎవరో అన్నారట' చెప్పాడు శాస్త్రి

—జి వెంకటేశ్వర్లు

మార్కాపూర్

ఒక బస్సులో ఇరవై మంది ప్రయాణీకులున్నారు.... బస్సు బయలు దేరింది.... ఎంతమంది దిగుతారు? చిక్కు ప్రశ్న వేశాడు పదేళ్ళ బాలు.

'కండక్టర్ డ్రైవర్‌తో కలిపి ఇరవై ఎనిమిది మంది దిగుతారు' చెప్పాడు బాబాయి.

'తప్పు – ఎవరూ దిగరు' ఖచ్చితంగా చెప్పాడు బాలు.... 'ఎందుకని?'

ఆ దేముడొచ్చినా దయ్యమొచ్చినా నిన్ను నేను తప్పకుండా పెళ్ళి చేసుకుంటాను. 'నిన్ను విడిచిపెట్టేది లేదు' అని రాధకి వాగ్దానం చేశాను, నాన్నా- అన్నాడు మంత్రిగారి కొడుకు బాలు.

'శెభాష్, నా బుద్ధులు ఇప్పడిప్పుడే నీకు అబ్బుతున్నాయిరా' అని కొడుకును మెచ్చుకున్నాడు మంత్రిగారు.

—జి రాము

నందిగామ

ముగ్గురు మూర్ఖులు ఓ చింతచెట్టు ప్రక్కన కూర్చుని ఇలా అనుకుంటున్నారు :

'హఠాత్తుగా ఈచింత చెట్టుకి నిప్పంటుకుంటే ఆ వ్రేలాడే చింతకాయలెలా ?'

'వెంటనే ఆకాశంలోకి ఎగిరి పోతాయి' అన్నాడు రెండో వ్యక్తి.

'వట్టి మూర్ఖంగా మాట్లాడకండి చింతకాయలు ఎగిరిపోవటమా? అలా జరగదు. చింతకాయలు వెంటనే ప్రక్కచెట్టు నంటుకుని వ్రేలాడతాయి' - అని చెప్పాడు మూడో వ్యక్తి.

—ఫి బాలసుందరరావు

ఫిరంగిపురం

'బస్సు రన్నింగ్‌లో ఉందికదా !' అని గట్టిగా నవ్వాడు బాలు.

—భవాని
మచిలీపట్నం

ఇంతకు ముందు మన ఆపీసులో మగ పురుగులంతా నీ పొందుకోసం నిన్ను తెగ ఏడిపించేవాళ్ళుకదా . ఇపుడు నీ దరిదాపులకి ఎవరూ రావడం లేదే?- అడిగింది మాలిని.

'అదొక రహస్యంలే' - అన్నది సుందరి.

'ఏమిటో ఆ రహస్యం'— ఆత్రంగా ప్రశ్న వేసింది మాలిని

'నాకు ఎయిడ్స్ వచ్చిందని మన ఆఫీసులో చెప్పాను అంతే, నా జోలికి రావడం మానేశారు '

—సెల్వి
నందిగామ

అష్టలక్ష్ములు నేను గొప్ప, నేను గొప్ప-అని వాదించుకుంటున్నారు. ఆ వాదన విన్న ధైర్యలక్ష్మి 'అయితే నేను మీతో ఉండటం లేదు' అని వెళ్ళిపోయి, ఎక్కడో దాగున్నది.

మిగిలిన ఏడుగురు లక్ష్ములకు మతి పోయింది. కొన్ని రోజులకి తేరుకొని పేపరు ప్రకటన ఇచ్చారు.

'నీవెక్కడున్నా తిరిగి రావలసినది నీవు లేనిదే మే మేడుగురం వ్యర్ధం. .. కాబట్టి నీవు వచ్చిన వెంటనే సన్మాన వేదిక పైనిన్నలంకరించెదము . ఇట్లు నీ రాకకై ఎదురుచూచే సప్తలక్ష్మి యూనిట్'

—కె రామకృష్ణ
రేపల్లె

టైం చూసుకుంటూ, 'ఇక్కడనుండి విజయవాడ వెళ్ళేసరికి ఎంతవుతుం దండీ' అడిగాడొక ప్రయాణీకుడు.

'ఐదు రూపాయల పావలాండి—' బుకింగ్ క్లర్క్ టకీమని చెప్పాడు.

—కెవి నరసింహం
అచ్చంపేట

జి. పుల్లారెడ్డి
స్వచ్ఛమైన నేతి మిఠాయి

హైదరాబాదు
ఫోను : 230833

కర్నూలు
ఫోను : 20288, 21445

# పాఠకుల తీర్పు

చందూర్‌గారికి : 'జ గ తి' ముఖ చిత్రాలు ప్రత్యేకంగా ఉంటున్నాయి. 'భ్రమర గీతం' ధారావాహిక నవల ఎంతో ఆసక్తి జనకంగా ఉంది. 'డైరీ' శీర్షిక ఎన్నో విశేషాలను తెలుపుతున్నది· 'పాతికేళ్లనాటి పిక్చర్' ఈ పత్రికకు హైలైట్.

—సి నాగేశ్వరరావు
సికింద్రాబాదు-25

చందూర్‌గారికి : నమస్కారములు. మాకు తెలియని పాతికేళ్లనాటి చిత్ర కథ చక్కగా తెలియజేయుచున్నారు. నిమ్మతొనలు సరదాగా ఉంటు న్నాయి. నేను మీకు కొన్ని జోక్స్ త్వరలో పంపగలను, ఇంతే సంగతులు.

—కె రవికుమార్
మైలవరం

చందూర్‌గారికి : నమస్కారములు: 'జ గ తి' ప్రతి నెలా చదువుతున్నాను. అందులో మొదట చదివేది 'డైరీ' - చదువుతున్నంత సేపూ మద్రాసులో ఉన్నట్లే!.... మా స్నేహితుడు 'యాత్రా చరిత్రలు' మీద పిహెచ్.డి. చేస్తున్నాడు. అతనికి మీరు 1986 లో వ్రాసిన 'A Week in Araku' కావాలి. సెప్టెంబరుది తప్ప మిగతా మూడు సంచికలూ నా దగ్గిర లేవు. శ్రమ అనుకోక విపిపి ద్వారా పంపగలిగితే ..

—ఆనంద్
హైదరాబాదు

చందూర్‌గారికి : నమస్కారములు. సినీ చిత్రపోటీ తీసివేయడం నాకు చాలా నిరాశ కలిగించింది. ఈ మధ్య పాతపత్రికలు తిరగవేస్తూ వుండగా, ఎడ్నాఫెర్బర్ వ్రాసిన 'పట్నవాసం' కనిపించి చదివాను - చాలా బాగుంది - అనువాదకుల పేరు లేదు మీరే చేసివుంటారని పించింది. బెన్, బెల్లా పాత్రలు అతి సహజంగా వుండటమేగాక, భారతీయులకు చాలా సన్నిహితంగా ఉన్నాయి. పత్రిక అన్న తర్వాత కనీసం ఒక్క కథ అయినా వుండాలి కద! మీరు వేయరు కనీసం మినీ కథలైనా వేయండి. '365 జ గ తి' నాకు అందలేదు - పంపమని కోరుతున్నాను.

—ఎ శేషు
మర్రిపాలెం

మృగాలను మచ్చిక చేసుకోవడం ఎంతకష్టమో పిల్లల విషయమూ అంతే.

—ప్లాటో

# ప్రాచీన సాహితి

ఒక యెడ బవ్వళించు హరి యొక్క యెడన్ వసియించు రాక్షస
ప్రకరము లొక్కచో సడగు బర్వత సంఘము లెక్కడన్ బలా
హకములతోడ నుండు బడ బాగ్నియు విస్తృత మూర్జితంబునుం
బ్రకటభ రక్షమంబగుచు భాసిలు నౌర సముద్రమెంతయున్

—భర్తృహరి



జంగాలపాలు దేవాంగుల విత్తంబు
కాపు విత్తంబు పంబకాని పాలు
బలిజీల విత్తంబు పట్టి దాసరి పాలు
గొల్ల విత్తము పిచ్చు గుంట పాలు
వ్యాపారి విత్తంబు వార కాంతల పాలు
కల్లు విత్తము రుంజకాని పాలు
పరజాలపా ల్మిష్ట కరణాల సొమ్ము ఘూ
ర్జరుల విత్తంబు తస్కరుల పాలు
కవుల కీగలజాతి యొక్కటియు లేదు
వితరణ వైశ్యులకు బెండ్లి వేళ గలదు
కొంగుపఱవిరి నృపతు లాకూటికొఱకు
రామలింగేశ రామచంద్రపురవాస

—రామలింగేశ్వరశతకం



ఎంచ మునీంద్రులందు విజితేంద్రియు డైన తపస్వి కూర్మి గా
వించి, శకుంతలం బెనిచి, విస్మృతి నొందిన మోహపాశముల్
త్రెంచుకొనంగ లేక, తియతీపుల జిత్తము గాసి పెట్టె శీ
లించిన నెవ్వ డింక వదలింపగ నోపెడు మోహబంధముల్

—పినవీరభద్రుని 'శృంగార శాకుంతలం

# పాత్రికేశ నా పిక్చర్

## శంకరరెడ్డి
## 'లవకుశ'

శ్రీ రామగాధను ఎన్నిసార్లు వెండి తెరమీద చూసినా ఇంకా చూడాలనే అనిపిస్తూంటుంది ఆంధ్ర ప్రజలకు, అందుకు కారణం భద్రాద్రి రాముడు వారి యిష్టదైవం కావడం వల్ల నేమో! ఏమైనప్పటికి రామసంకీర్తనకీ, రామ నామోచ్చారణకు ఆంధ్ర ప్రజాహృదయం నిరంతరం స్పందిస్తూనే ఉంటుంది. శంకరరెడ్డి 'లవకుశ' చిత్రం, తెలుగు చలనచిత్ర జగతిలో ఒక నూతనాధ్యాయమనవచ్చు ఈ గేవాకలర్ చిత్రానికి సుమారు 30 లక్షలు ఖర్చు అయిందని వినికిడి. కాని, ప్రతి వందా ప్రతి వెయ్యి ఉత్తమ సాంకేతిక విలువల కొరకు, అనుపమ నటనా కౌశలం కొరకు, అడుగడుగునా వెన్నెల సోనలు చిలుకరించే సాహిత్యామృతం కొరకు వెచ్చింప బడటు మాత్రం ప్రత్యక్ష నిదర్శనం కనబడుతోంది. రామకథ అపుడే అయిపోయిందా అన్నంతవరకే రమణారెడ్డి పాత్ర సబబుగా ఉంది - ఆపైనస్థాయి దిగజారి, వాల్మీకి ఆశ్రమానికే మచ్చతీసుకు వచ్చింది. కరుణరస ప్రధానమైన ఈ కమనీయ కావ్యంలో రమణారెడ్డి స్థానం లేదు. ఎన్. టి. రామారావు, అంజలీదేవి, కాంతారావు, నాగయ్య, కన్నాంబ మొదలైనవారు తమ పాత్రలలో లీనమై నటించ గలిగారు. లవకుశలిరువురు (నాగరాజు, సుబ్రమణ్యం) తమ పాత్రలని రసవత్తరంగా పోషించారు రెండు తరాలకీ వంతెన కట్టిన విధంగా తండ్రీ కొడుకులు (సి పుల్లయ్య-సి యస్ రావు) దర్శకత్వం నెరపి, పండిత పామరు లందరిచేత 'భేష్' అనిపించుకున్నారు. బ్లాక్ అండ్ వైట్, గేవాకలర్ తరువాత 'లవకుశ' చూడవలసినది టెక్నికలర్‌లోనో, టెలివిజన్‌లోనో!

-యవ్వార్ చందూర్ సమీక్ష
'జగతి' — డిసెంబరు, 1965

✱

స్త్రీలపట్ల సచ్చింతన, గౌరవ మర్యాదలు ఉన్నవారు అతివల అలంకారాలకు విలువనియ్యరు - వాటివంక చూడరు. —యానటోల్‌ఫ్రాన్స్

మనిషికి ముఖ్యంగా మూడే భావోదేకాలు వున్నాయి. సంతోషం, బాధ, కోరిక. స్పినోజా

మాకు ఇంగ్లాండులో ప్రత్యేకంగా వినోదాలంటూ ఏమీలేవు - మతము - త్రాగుడు తప్ప. —సిడ్నిస్మిత్

# వెన్నెల కెరటాలు

## అన్నా హజారె

మహారాష్ట్రలోని పూనెకు 50 మైళ్ళ దూరంలో గల రెలిగాం-షిండె అనే గ్రామంలో అన్నా హజారె అనే వ్యక్తి నివసిస్తున్నాడు. 1975 ఆగష్టులో ఆర్మీ సర్వీసు నుంచి రిటైరయినారు. గాంధీగారి పద్ధతులలోతనకున్నదంతా తన గ్రామానికి ధారపోశాడు. నీరు ఏమీ వృధా కాకుండా చిన్న డాములను పై ప్రదేశాల్లో నిర్మించి నీటిని నిల్వచేయటం ద్వారా, దానిని చిన్న కాల్వల ద్వారా వ్యవసాయ పనులకు పంచటం ద్వారా ఈ ప్రదేశమంతా పచ్చని పైరులతో కనుల పండుగగా నున్నది. ఈ నీటి పనినంతా స్వచ్ఛందంగా తరుణ్ మండల్ అనే యూత్ క్లబ్ చూస్తున్నది. సంవత్సరమంతా నీరు లభ్యం కావటం వలన మూడు పంటలు పండించటం ద్వారా, కూరగాయలు మున్నగునవి పూనె, అహ్మద్ నగర్‌లకు గ్రామ సహకార సంస్థ ద్వారా కొన్ని వాహనములలో పంపబడుతున్నాయి. లాభాలను తగు నిష్పత్తిలో పంచుకుంటారు. గ్రామానికి ఒకవైపున గల బంజరు భూమిని ఫలవంతం చేసేందుకు ట్రాక్టరును కొన్నారు. దాదాపు 2 లక్షల చెట్లను గ్రామం చుట్టుపట్ల నాటటం జరిగింది. పళ్ళ తోటలను పెంచి ప్రతి కుటుంబమూ పళ్ళను పొందే ఏర్పాటు కలదు ధాన్యానికిగాను ఒక బ్యాంకును నెలకొల్పారు స్కూలుకు 600 మంది పిల్లలు హాజరవుతున్నారు. దేహారోగ్యము, క్రమ శిక్షణ, మంచి నడవడి ముఖ్య ఉద్దేశాలు మహారాష్ట్రలోని అనేక విలేజి లెవల్ వర్కర్లు ఈ గ్రామానికి వచ్చి తీరుతెన్నులు తెలుసుకుంటున్నారు. హజారె సాధించిన ఈ మంచి పనులను చూడటం కోసం దేశ విదేశాల నుండి అనేకమంది వచ్చి చూసి అభినందనలు కురిపించుచున్నారు.

—సహస్ర బుద్ధె

—'సైనిక సమాచార్'లో

## భావ దారిద్ర్యం

తెలుగు చలనచిత్ర పరిశ్రమకు క్షీణదశ పట్టడానికి కారణాలు అనేకం. తెలుగు చిత్రాలు రాసిలోమిన్న, వాసిలో సున్న అనేవాదు పడిపోవడం మొదటి కారణం. కథలో బలం ఉండటం లేదు. వైవిధ్యం సంగతి అసలే అడగవద్దు. ఒకవేళ వైవిధ్యం ఉన్నా అది మెచ్చుకోదగినదిగా ఉండటం లేదు. ఇంతేగాక, కథా కథన కౌశలం, దర్శక ప్రతిభ నానాటికీ అడుగంటి

పోతున్నాయి. కుప్పిగంతులు, బూతు పాటలు, కుర్రకారును ఉద్రేకపరచే అసభ్యకరమైన సన్నివేశాలు, ద్వంద్వార్థాలతో కూడిన సంభాషణలు— ఇటువంటి చౌకబారు ధోరణులతో డబ్బు చేసుకోవాలని నిర్మాతల తాపత్రయం. కాని ఈ చిట్కాలు ఎక్కువ కాలం పనిచేయలేదు. ఒకనాడు వాటికి పులకించిన వర్గాలకు సైతం అవి క్రమంగా మొహం మొత్తాయి. సభ్యత, సంస్కారం కలిగిన వర్గాలకు ఈ బాపతు ధోరణులు రోత పుట్టించడం సంగతి సరేసరి. సినీరంగంలో నేడు భావ దారిద్ర్యం పరాకాష్ఠకు చేరుకొన్నట్టు కనిపిస్తున్నది.

—సంపాదకీయం
'కోస్తావాణి'

## పైడి లక్ష్మయ్య

స్నేహశీలి, ధార్మిక సేవాతత్పరులు నైన శ్రీ పైడి లక్ష్మయ్య అనంతపురం జిల్లా అచ్చంపల్లి గ్రామంలో 1904 మే 23న జన్మించారు. ప్రాథమిక విద్య అక్కడే పూర్తిచేసి అనంతపురం, మదనపల్లిలో ఉన్నత విద్య నభ్యసించారు. న్యాయశాస్త్రంలో పట్టభద్రులై అనంతపురంలో ప్రముఖ న్యాయవాదిగా పేరు గాంచారు. స్వాతంత్ర్య ఉద్యమంలో పాలుపంచుకొని, 1943-48 మధ్యవారు అనంతపురం జిల్లా బోర్డు అధ్యక్షులుగా పనిచేశారు. 1952 నుండి 57 వరకు పార్లమెంటు సభ్యులుగా ఉండి పెక్కు ప్రజా సమస్యల పరిష్కారానికి కృషి చేశారు. అటు తర్వాతనే వారు రాష్ట్రదేవాదాయ ధర్మాదాయ కమీషనరుగా నియమితులై, రాష్ట్ర ధార్మిక సంపదకు సంరక్షకులుగా చక్కటి సేవలను నిర్వహించారు. రాజకీయ ధార్మిక రంగాలలో మాత్రమే కాక సాహిత్య రంగలలో కూడా శ్రీ లక్ష్మయ్య అపారమైన కృషి సల్పారు. "పైడి" ఇంటి పేరును సార్థకం చేస్తూ బంగారు పంటలు పండించిన జీవితం వారిది." (1987 ఏప్రిల్‌లో దివంగతులయారు.)

—ఆరెస్ మూర్తి
'తెలుగు విద్యార్థి'లో

✸



ప్రతి విషయానికీ రెండు వాదాలుంటాయి. ఒకటి సత్యవాదము, మరొకటి అసత్యవాదము. పిల్లలకు మనం రెండిటిలోనూ శిక్షణ యిచ్చి అసత్య వాదమేమిటో విశదపరచాలి.

—ప్లేటో

సమస్త ప్రపంచాన్నీ సమ బుద్ధితో చూసే దేవుణ్ణి - స్పినోజా చెప్పిన దేవుణ్ణి ఒక్కణ్ణే -- నేను నమ్ముతాను. మనుషులతో ఆటలాడుకుంటూ, వారి చేత చేయరాని పనులు చేయించే విలిపి దేవుణ్ణి నేను నమ్మను.

—ఐన్‌స్టీన్

## మానవ ప్రగతి

### ఓజోన్

అంటార్కిటికా మంచుఖండం పైన వాతావరణంలోని 'ఓజోన్' పొరలో ఏర్పడుతున్న 'రంధ్రం' పై పరిశీలన జరిపేందుకు అమెరికా పెద్దయెత్తున ఒక కార్యక్రమాన్ని చేపడుతున్నట్లు 'నాసా' ప్రకటించింది. అమెరికాకు చెందిన కొన్ని పరిశోధక విమానాలు, అంటార్కిటికా పరిశోధనా కేంద్రాల లోని ఏడు బృందాలు ఈ కార్య క్రమం లో పాల్గొంటాయి. ఈ మధ్య కొన్ని సంవత్సరాలుగా ప్రతి అగస్టు, సెప్టెంబరు నెలలలో అంటార్కిటికా పైన వాతావరణంలోని 'ఓజోన్' లో 50 శాతం, లేదా అంతకు మించిన తగ్గుదల ఏర్పడుతుండడం శాస్త్రవేత్త లకు అంతుచిక్కని సమస్యగా మారింది. ఈ ఓజోన్ క్షీణింపును మొట్టమొదటి సారిగా 1985 లో బ్రిటిష్ శాస్త్ర వేత్తలు కనుగొన్నారు. వాతావరణం లోని 'ఓజోన్' పొర భూమికి ఒక రక్షణ కవచంలా పనిచేస్తూ హానికర మైన అల్ట్రావయొలెట్ రేడియేషన్ బారినుంచి కాపాడుతుంది. కాగా, వివిధ పారిశ్రామిక అవసరాలకోసం మనిషి తయారుచేసిన 'క్లోరోఫ్లోరో కార్బన్స్' లాంటి విష రసాయనాలు వాతావరణంలో కలుస్తూండడంతో 'ఓజోన్' పొర క్షీణిస్తున్నదని కొందరు శాస్త్రజ్ఞులు ఎన్నో ఏళ్లుగా అభిప్రాయ పడుతున్నారు. ఇప్పుడు అంటార్కిటికాపై ఏటా ఒక నిర్ణీత కాలంలో 'ఓజోన్' తరుగుదలకు కారణమేమిటి ? అంటార్కిటికాపై ఓజోన్ పొర క్షీణింపు పట్ల అంత ర్జాతీయ స్థాయిలో పెద్దయెత్తున ఆందోళన వ్యక్తం కావడంతో 'క్లోరో ఫ్లోరో కార్బన్స్' ఉత్పత్తిని పరిమితం చేయడంపై ఐక్యరాజ్య సమితి అధ్వర్యంలో 30 దేశాలు సంప్రదిం పులు జరిపాయి. దీనిపై ఒక ఒప్పం దానికి సంబంధించిన తుది ముసాయిదా కోసం త్వరలో మాంట్రియల్‌లో సమావేశం జరుగుతుంది. అంటార్కి టికాపై ఓజోన్ పొర క్షీణింపును గురించి పరిశోధనలో 'నాసా' కి చెందిన రెండు అధునిక 'యు 2' విమానాలు భూమికి 21,000 మీటర్లు ఎత్తున వాతావరణం ఎగువ భాగంలో ఎగురుతాయి. వీటికంటె బాగా పెద్ద

దైన మరొక 'డి సి - 8' విమానం వాతావరణం దిగువ భాగంలో ఎగురుతుంది ఈ కార్యక్రమం కోసం ఈ విమానాలను 'ఎగిరే పరిశోధనా శాలలు' గా రూపొందించారు. వాయు నమూనాలను సేకరించగల పెక్కు పరికరాలు, వివిధ రకాల లెక్కలు వేయగల రిమోట్ సెన్సింగ్ ఎక్విప్‌మెంట్‌ను ఈ విమానాలు వాతావరణం లోకి మోసుకు వెళతాయి పరిశోధనల ద్వారా లభించే సమాచారాన్ని పూర్తిగా విశ్లేషించడానికి పెక్కు మాసాల వ్యవధి అవసరమైనప్పటికీ — ఈ సమస్యకు అత్యవసర పరిష్కార మార్గం అవసరమైన దృష్ట్యా పరిశోధనా ఫలితాలపై ఒక ప్రాథమిక ప్రకటనను తొందరలో విడుదల చేస్తారు.

## రాగి

మన తాతలకాలం వరకూ కూడా రాగి పాత్రలు వాడుకలో వుండేవి. శిలుంపట్టిన రాగి పాత్రలు ఆరోజుల్లో అందరి ఇళ్లలోనూ దర్శనమిచ్చేవి. ఎర్రటి ఈ రాగి పాత్రలను వాటి సహజమైన మెరుపుతో అందంగా వుంచేందుకు గృహిణులు ప్రతిరోజూ వాటిని చింతపండుతో తోమేవారు. ఇప్పటికీ అక్కడక్కడ పాతకాలపు ఇళ్లలో దర్శనమిచ్చే ఈ రాగి పాత్రలు గతించి పోయిన యుగానికి సాక్షీభూతాలు. ఆధునిక యుగంలో వీటి వాడుక క్షీణించింది. రాగి పాత్రల స్థానంలో అల్యూమినియం స్టెయిన్‌లెస్ స్టీల్, తగరంతో చేసిన పాత్రలు వాడుకలోకి వచ్చాయి గృహావసరాల్లో రాగి వాడకం తగ్గడం ఒకందుకు మంచిదే అయింది ఆధునిక నాగరికత వరప్రసాదాలైన విద్యుత్తు, ఎలక్ట్రానిక్, కమ్యూనికేషన్ల రంగాల్లో రాగి వాడకం పెరిగింది. ఇతర లోహాలనుంచి తనను వేరుచేసే తన ప్రత్యేక లక్షణాల కారణంగా ఈ రంగాల్లో రాగి వాడకం తప్పనిసరి ఈ రంగాల్లో రాగి బదులు మరోలోహాన్ని వినియోగించడం వీలుకాదు. ఇలా సమకాలీన యుగంలో రాగి అనుల్లంఘనీయమైన కీలక స్థానాన్ని సంపాదించుకుంది. నిజానికి రాగికిగల ప్రత్యేక లక్షణాలున్న ఇతర లోహాలు లేకపోలేదు. అయితే అలాంటి లక్షణాలున్న బంగారం, ప్లాటినంవంటి లోహాలు చాలా ఖరీదైనవి బ్రిటిష్ పాలకులు మన దేశం విడిచివెళేనాటికి రాగి ఉత్పత్తి సాలీనా 6000 టన్నులు మాత్రమే వుండేది. స్వాతంత్ర్యానంతరం ఈ 40 ఏళ్ల వ్యవధిలో రాగి ఉత్పత్తి గణనీయంగా పెరిగింది. 1986-87 లో వార్షిక రాగి ఉత్పత్తి 51000 టన్నులు. బ్రిటిష్‌వారి హయాంలో మొత్తం రాగి ఉత్పత్తి బ్రిటన్‌కు చెందిన ఇండియన్ కాపర్.కార్పొరేషన్ ఆధ్వర్యంలో జరిగేది. అప్పట్లో బీహార్ లోని సింగభం జిల్లాకు చెందిన మొసబనీ రాగి గనులే వినియోగంలోకి వచ్చాయి. ఇప్పుడు రాగి ఉత్పత్తి పెరిగినా, రాగివాడకం కూడా ఎక్కువ కావడంలో 'ఎమ్ఎమ్‌టిసి' విదేశాల

నుంచి సాలీనా 55000 టన్నుల రాగిని దిగుమతి చేసుకొంటోంది. రాజస్థాన్‌లోని ఖత్రి, కోలిహాన్, దరిబా, బీహార్‌లోని గనుల్లోను రాగి తవ్వకం ప్రారంభించవచ్చని నిర్ధారించారు నాలుగో దశాబ్దంలో గనుల తవ్వకానికి అత్యంత అధునికమైన పద్ధతులను ప్రవేశపెట్టడం జరిగింది గనుల తవ్వకం పద్ధతులను మెరుగుపరచడం, ముడి ఖనిజాన్ని కరిగించడం, హైడ్రో మెటలర్జీ, ఉప ఉత్పత్తుల ఆదావంటి రంగాల్లో హెచ్ సి. ఎల్ ఎన్నో వినూత్న విధానాలను ప్రవేశపెట్టింది అధునిక, సాంకేతిక పద్ధతులను ప్రవేశపెట్టడంవల్ల గనుల్లో ఉత్పత్తి సామర్థ్యం పెరిగింది. ఇటీవల కాలంలో గనులో భద్రతా పరిస్థితులు కూడా మెరుగయ్యాయి రాగికి బదులు అనేక ఇతర లోహాల వాడకం పెరుగుతున్నప్పటికీ, రాగి ఉపయోగాలు మరింత విస్తరిస్తూండడంతో ఈ లోహం డిమాండ్ ఇప్పట్లో తగుముఖం పట్టే అవకాశంలేదు. క్రీ.శ. 2000 సంవత్సరం నాటికి రాగి అవసరాలు ఇంకా పెరగవచ్చు. రానున్న 30 సంవత్సరాల్లో దేశం అవసరాలు తీరాలంటే కోటీ పదిలక్షల టన్నుల రాగి కావాల్సి వస్తుందని అంచనా. దేశంలో రాగి గనులకు సంబంధించి ఇంతవరకూ మనకు లభించిన సమాచారం ప్రకారం మలాంజ్‌ఖంట్, సింగభం ప్రాంతాల్లో మాత్రమే ఆశాజనకమైన రాగి నిల్వలున్నాయి. అంటే దేశానికి అః మొత్తంలో 38 నుంచి 44 శాతానికి మించి రాగిని మనం దేశంలో ఉత్పత్తి చేసుకోలేకపోవచ్చు భవిష్యత్తులో మరాంజ్‌ఖండ్, సింగభం లాంటి భారీ గనులను కనుగొంటే తప్ప రాగి ఖనిజం కోసం మనం విదేశాలపై ఆధారపడ్డం తప్పనిసరి

## సూపర్ కండక్టర్లు

ఇంధన నష్టానికి తావులేని విధంగా విద్యుచ్ఛక్తిని 'రవాణా' చేయగల సరికొత్త సూపగ్ 'కండక్టింగ్' పదార్థాలను అభివృద్ధి పరచడంలో మరికొన్ని విజయాలను అమెరికన్ పరిశోధకులు సాధించారు ఒక కొత్త 'సూపర్ కండక్టింగ్' తీగకుగల విద్యుత్ వాహక సామర్థ్యాన్ని 30 రెట్లు పెంపొందించ గలిగినట్టు అమెరికా ఇంధన విభాగానికి చెందిన అర్గోనీ నేషనల్ లేబొరేటరీ వెల్లడించింది పెళుసైన 'సూపర్ కండక్టింగ్' పదార్థాలను విద్యుత్ వాహక తీగలుగా మార్చడం ఎలాగన్నది తెలుసుకోవడంపై గొప్పగొప్ప సాంకేతిక విజయాలు ఆధారపడి వున్నాయి. ఈ సాంకేతిక విజయాలు విద్యుచ్ఛక్తి 'రవాణా' మార్గాలు, అయస్కాంతపు కమ్మీలపైన గాలిలో వ్రేలాడుతూ ప్రయాణించే రైళ్ల లాంటి భారీ వాణిజ్యసరళి పథకాలకు దారి తీయవచ్చును 'సూపర్ కండక్టర్లు' విద్యుచ్ఛక్తిని ఎట్టి 'ప్రతిఘటన' లేకుండా 'మోసుకు' పోతాయి. మామూలు తీగలలో వాడే లోహాలు అలా కాకుండా - తాము 'మోసుకు

పోయే' విద్యుచ్ఛక్తిలో చాలా భాగాన్ని ఉష్ణంగా మార్చుతూ వృధాచేస్తాయి ద్రవనత్రజని ఉష్ణోగ్రత వద్ద ఒక 'సూపర్ కండక్టింగ్' పదార్థం చదరపు సెంటీమీటర్‌కు లక్ష 'యాంపియర్స్'కు పైగా విద్యుచ్ఛక్తిని 'మోసుకు' పోగలదని ఐ.బి.ఎం. శాస్త్రవేత్తలు చూపారు. 'రిఫ్రిజిరెంట్'గా విస్తృత వినియోగం వున్న ద్రవ నత్రజని మైనస్ 194 డిగ్రీల సెంటిగ్రేడ్‌లో వుంటుంది ఐ.బి.ఎం. శాస్త్రజ్ఞులు మనిషి వెంట్రుకలో కేవలం నూరవ వంతుతో సమానమైన మందం గల అతి పలుచని 'సూపర్ కండక్టింగ్' పదార్థం పొరను రూపొందించారు అవిరి నుంచి ఈ పలచని పొరను వారు తయారు చేయగలిగారు. ఇట్టి పొరలను సామాన్యంగా ఎలెక్ట్రానిక్ పర్క్యూట్‌లలో వినియోగిస్తారు. 'సూపర్ కండక్టింగ్' పదార్థం తాలుకు 'సింగిల్ క్రిస్టల్' తయారు చేసినట్లు వెల్లడించిన తొలి సంస్థ కూడా ఐ.బి.ఎం. కావడం గమనార్హం. ఈ 'క్రిస్టల్'ను పరిశీలించడం ద్వారా పరిశోధకులు 'సూపర్ కండక్టివిటీ' అనేది ఎలా పనిజేస్తుందో ఖచ్చితంగా నిర్ధారించవచ్చు. కొత్త 'సూపర్ కండక్టింగ్' సెరామిక్ పదార్థంతో చేసిన అతి సన్నని తీగ నుంచి తొలిసారిగా విద్యుచ్ఛక్తిని ప్రసరింపజేసిన 'అర్గోనీ' శాస్త్రవేత్తలు ఆ తీగ చదరపు సెంటీమీటర్‌కు 191 'యాంపియర్ల' వంతున 'కరెంటు'ను 'మోసుకు' తెలియజేశారు. ఇంతకు

పూర్వం జరిపిన ప్రయోగాలలో వారు ఉపయోగించిన తీగ చదరపు సెంటీమీటర్‌కు 6 యాంపియర్ల విద్యుచ్ఛక్తిని మాత్రమే 'మోసుకుపోయింది' ఇంతవరకు కూడా అన్ని సూపర్ కండక్టింగ్ తీగలను ద్రవరూపంలో వుండే 'హీలియం'తో చల్లబరచవలసి వచ్చేదని, దీనివల్ల అవి బాగా వ్యయ భరితమైపోయి వాటి ఆచరణాత్మక వినియోగం పరిమితమైందని వివరించారు. 'సూపర్ కండక్టింగ్' సెరామిక్ పదార్థాలతో తయారు చేసిన తీగలు అణు విద్యుత్ రియాక్టర్లకు శస్త్రచికిత్స జరపనిదే కనిపించని శరీర భాగాలను దానితో పనిలేకుండానే చూపగల 'న్యూక్లియర్ మాగ్నెటిక్ ఇమేజింగ్' యంత్రాలకు, పట్టాలకు 15 సెంటిమీటర్ల ఎత్తున ఒక సూపర్ కండక్టింగ్ అయస్కాంత క్షేత్రం ద్వారా గాలిలో తేలియాడుతూ గంటకు 480 కిలోమీటర్ల వేగంతో ప్రయాణించే 'మాగ్నెటిక్ లెవిటేటింగ్' రైళ్లకు ఎంతగానో ఉపయోగ పడతాయని అంటున్నారు. ఒక సూపర్ కండక్టింగ్ తీగ ఒక అయస్కాంతపు 'కాయిల్' లోకి చుట్టుకుపోయేంత మెత్తగా వుండడంతోపాటు బలీయమైన అయస్కాంత క్షేత్రాల ఒత్తిడులను తట్టుకునేంత పటిష్ఠంగా కూడా వుండాలి. సంప్రదాయిక అయస్కాంతాలకంటె శక్తిమంతమైన సూపర్ కండక్టింగ్ ఎలెక్ట్రో మాగ్నెట్ల ఉత్పాదనవల్ల కార్లు, నౌకలకు ఉపయోగపడే అతి చిన్నవైన, అత్యంత సమర్థమైన

తక్కువ ఖర్చుతో కూడుకొని వుండే విద్యుత్ మోటార్లు అందుబాటులోకి వసాయి.

రాజకీయ పరమైన, మతపరమైన, లేదా జాతిపరమైన ఏ అంశాలు కారణ మైనా, టెర్రరిజం మానవత్వం పట్లనే నేరమని చెప్పవచ్చు. హింస ద్వారా, బలప్రయోగం ద్వారా లక్ష్యాలను సాధించుకొనాలనే టెర్రరిస్టులు, ఒక్క విషయాన్ని విస్మరిస్తున్నారు భీతావహం సృష్టించడం ద్వారా, హింసా విధానాల ద్వారా కొన్ని విజయాలు సాధించినా అవి శాశ్వతంగా - ఉండగలగవన్నదే టెర్రరిస్టులు విస్మరిస్తున్న మౌలిక సత్యం. పైగా టెర్రరిజం శాశ్వత వైరాలను, విద్వేషాలను సృష్టిస్తుంది. ఐక్యరాజ్య సమితి సర్వసభ్య సమావేశంలో టెర్రరిజం అన్న అంశాన్ని చర్చకు పెడుతూ, అనేక సందర్భాలలో . హింసా, నిస్పృహ, నిరాశ, అన్నవి బాగా పాతుకు పోయి, లక్ష్య సాధనకు ప్రాణత్యాగానికైనా కొందరు సిద్ధపడే పరిస్థితే టెర్రరిజానికి కారణం అని సమితి ప్రధాన కార్యదర్శి చెప్పారు. దీర్ఘకాల ప్రక్రియ ఫలితాలను ఇచ్చేవరకూ చట్ట బద్ధంగా ఏర్పడిన ప్రభుత్వాలు టెర్రరిజం వ్యాప్తిని నిరోధించడానికి తగు చర్యలు గైకొంటూనే ఉండాలి. దక్షిణాఫ్రికాలో హెచ్చరిల్లుతున్న జాతిపరమైన హింసాకాండ న్యాయ సూత్రాలకే విరుద్ధం. ప్రభుత్వపరమైన టెర్రరిజానికి ఇది ఉదాహరణగా ఉంటున్నది. అనేక దేశాలలో కానవస్తున్న టెర్రరిజం పోకడలను గమనిస్తే, ప్రజ్వలనకు హేతుభూతమైన మౌలిక సమస్యలను పరిష్కరించడం వల్లనే దీనిని నిర్మూలించడం సాధ్యమన్న విషయం సుస్పష్టమవుతోంది. టెర్రరిజాన్ని నిర్మూలించాలంటే ప్రజల సహకారం, అంతర్జాతీయమైన మద్దతు అత్యవసరం. చిన్న చిన్న పేద దేశాలు కూడా పెద్ద దేశాలను టెర్రరిస్టుల సాయంతో ఏవిధంగా ఇరుకున పెట్టగలవో, తెలుసుకోవాలంటే డామినీలా పెర్రీ - లారీ కాలిన్స్ రచించిన 'ది ఫోర్త్ హర్స్‌మన్' గ్రంథం చదవడం అసక్తిదాయకంగా ఉంటుంది. హైజాకర్లకు ఏదేశమూ ఆశ్రమం ఇవ్వరాదని, వారిని స్వదేశానికి అప్పగించాలనే 'హేగ్' ఒప్పందంలోని ఏడవ నిబంధన స్పష్టం చేస్తున్నా కొన్ని దేశాలు దీనిని రాజకీయ ప్రయోజనాల దృష్టితో ఉల్లంఘిస్తూ రావడం దురదృష్టకరం. అంతర్జాతీయ టెర్రరిజం నిర్మూలనకు టోక్యో ఒప్పందం, మాంట్రియల్ ఒప్పందం వంటివి అనేకం ఉన్నా అన్ని దేశాలూ చిత్తశుద్ధితో వీటిని పాటించక పోవడం వల ఈ

బలవంతుల విజయమే ఈ నాగరిక ప్రపంచం. —ప్లాటో

మనం బళ్లో నేర్చుకున్నదంతా మర్చిపోయాక మిగిలేదే సిసలైన విద్య. —హేలిఫాల్స్

సమస్య నానాటికి జటిలం అవుతోంది. ఈ ఒప్పందాలు ఖచ్చితంగా అమలు జరగాలంటే ప్రతీ దేశమూ దేశీయ చట్టాలు ఈ అంతర్జాతీయ ఒప్పందాలకు అనుగుణంగా ఉండేటట్టు చర్యలు గైకొనాలి. టెర్రరిస్టుల సాధారణంగా విదేశాలలో ఆధునిక మారణాయుధాలను సేకరించుకొని, రహస్యంగా తాము భీతావహం సృష్టించ దలచిన ప్రాంతంలో ప్రవేశిస్తారు. తమ హింసా చర్యలను గురించి ఏ మాత్రం బయటికి పొక్కకుండా అన్ని జాగ్రత్తలు తీసుకొని, అకస్మాత్తుగా బీభత్స కాండకు దిగుతారు. అందువల్ల టెర్రరిజాన్ని నిర్మూలించాలంటే ప్రజల సహకారం అత్యవసరం ప్రజలు చూసీ చూడనట్టు ఉపేక్షా వైఖరి ప్రదర్శించినంతకాలం టెర్రరిజం నిర్మూలన సాధ్యం కాదు రాజకీయ కారణాల వల్ల ఉత్పన్నమైన టెర్రరిజం నిర్మూలనకు ప్రధానంగా రాజకీయపరిష్కారం పై ఆధారపడాలి. ☼

---


## ప్రతివారి ఇంటా ఉండవలసిన అపూర్వ గ్రంథాలు

శ్రీ వాల్మీకి రామాయణము వచనము ఉత్తరకాండతో 9 భాగములు రూ. 155

శ్రీ మహా భాగవతము - వచనము మూడు భాగములు రూ 90

శ్రీదేవి భాగవతము - వచనము 12 స్కంధములు రూ 60

శ్రీదేవి సప్తశతి రూ 18

అశోక ఆంగ్లేయబోధిని (ఇంగ్లీషు తెలుగు) రూ 20

గానకళా బోధిని (గొప్ప సంగీత గ్రంథము) రూ. 80

వేమన పద్య రత్నాకరము (2500 పద్యములు తాత్పర్యంతో) రూ 28

తెలుగు - ఇంగ్లీషు డిక్షనరి రూ 75

బృహత్ స్తోత్ర రత్నాకరము (పార్ట్ I & II దేవి - శివ) రూ. 60

వాత్స్యాయన కామసూత్రాలు (బొమ్మలతో) రూ. 20

గీత గోవిందము అష్టపదులు చిత్రాలతో రూ 10

శివ పురాణము రూ 10

మాఘ పురాణము రూ. 8

కార్తిక పురాణము రూ. 7

ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి రూ. 35

శ్రీమదాంధ్ర మహాభారతము వచన కావ్యము (3 భాగములు, 18 పర్వములు) రూ. 325

సుందరకాండము (తాత్పర్యముతో) రూ. 40

సౌందర్యలహరి (నామ వ్యాఖ్యానముతో, అమ్మవారి ముఖ చిత్రముతో) రూ. 65

యోగాసనములు రూ 9

శ్రీమద్భగవద్గీత (తాత్పర్యం) రూ. 12

స్తోత్ర కదంబము (94 స్తోత్రములు) రూ. 12

వ్రత రత్నాకరము (15 వ్రతములు) రూ. 20

## బాల సరస్వతి బుక్ డిపో

నెం. 4, సుంకురామశెట్టి వీధి, మద్రాసు - 1. Phone No. 29868

# కొత్త పుస్తకాలు

'ఓల్గా నుంచి గంగకు', – రచన రాహుల్ సాంకలత్యాయన్; తెలుగు సేత: వాగంటి తులసి. ప్రచురణ· విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజ్ఞాన భవన్, 4–1–435, బ్యాంక్ స్ట్రీట్ హైదరాబాద్- 500001 వెల: రు 30-00.

'రాహుల్‌జీ' గా, ప్రఖ్యాతి పొందిన రాహుల్ సాంకృత్యాయన్, మన దేశంలో వేళ్ళమీద ఎన్నదగిన మేధావుల్లో ఒకరు గొప్ప హేతువాదిగా పరిణతి పొందిన యీ సంస్కృత పండితుడు తన యిరవైయవ ఏట, వైష్ణవ మఠమహంతుగా నియమించబడ్డారనీ, అయితే ఆ పదవిని ఆయన తిరస్కరించారనీ తెలిస్తే ఎంతో ఆశ్చర్యం కలుగుతుంది. ఆగమశాస్త్రాలు, దర్శనాలు క్షుణంగా పఠించి, ఆర్యసమాజ ప్రభావంలో కొంతకాలం పనిచేశాక, శ్రీలంకలో త్రిపిటకాలను అధ్యయనం చేసి, బౌద్ధాచార్యులుగ గౌరవించబడ్డారు. టిబెట్‌లో విశేషంగా పర్యటించారు. అనేక భాషలు అభ్యసించారు. ప్రపంచ చరిత్రను సామూలంగా పరిశోధించారు. మార్క్సిజమ్‌ను విశ్వసించాకే తన సత్యాన్వేషణకు గమ్యమూ, పరిపూర్ణతా సిద్ధించినట్లుగా ఆయన భావించారు.

చరిత్ర చదువుతూంటే ఒక సంగతి స్పష్టమవుతూ వస్తుంది. ఆర్యులు మధ్య ఆసియా ప్రాంతంనుండి వచ్చినా, ఉత్తరధ్రువ ప్రాంతంనుండి వచ్చినా, క్రీస్తు పూర్వీకులు మెసపొటేమియాకు చెందిన వారయినా, ప్రాచీన రోమనులూ, గ్రీకులూ - అన్ని జాతుల మానవులలో సమానంగా కనబడే స్వాభావిక లక్షణాలన్నీ యీనాటి వరకూ కొనసాగుతూ వస్తున్నాయి. ఆకలి దప్పులూ, ప్రేమా, ద్వేషంతో పాటు అధికార కాంక్షా, దానికి సంబంధించిన స్పర్థలూ, తన గుంపును లేక జాతిని అధిక సంఖ్యల్లో పెంపు చేసుకోవాలనే తపనా యివన్నీ మానవజాతి ఆరంభమయిన నాటి నుండీ వున్నవే.

ప్రపంచ భాషలెన్నిటిలోనో, తులనాత్మక భాషాశాస్త్రాల్లో, మట్టిమీద, రాతిమీద, రాగి, యిత్తడి, ఇనుపలోహల మీద సంకేతాల రూపంలోనూ, లిఖితరూపంలోనూవున్న సాహిత్యంలో లేదూ లిఖించబడని పాటల్లో, కథల్లో ఆచారవ్యవహారాల్లోమంత్ర తంత్రాల్లో లభ్యమైన విషయాలను ఆధారంగా చేసుకొని రచించిన యిరవై కథలు యీ గ్రంధంలో వున్నాయి. మానవ

సమాజ వికాసం ఎట్లా జరిగిందో చిత్రించే చరిత్రకు కొద్దిగా కల్పన జోడించిన వర్ణ చిత్రపటాలు, యివి.

ఇప్పటికి ఎనిమిది వేల సంవత్సరాల నాడు జరిగి వుండవచ్చు నన్నట్లుగా వూహించబడింది 'నిశ' అనే మొదటి కథ. 'గుంపు' జీవనం సాగిస్తున్న ఆ రోజులల్లో స్త్రీయే, గుంపుకి నాయకురాలు. స్త్రీ పురుషుల సంబంధాలకు ఏ నిబంధనలూ ఏర్పడలేదు. వయసులో వున్నప్పుడు నిశ అధికారంలోనే 'కుటుంబం' నడుస్తూ వున్నా, క్రమంగా 'నిశ' కూతురు లేఖ శక్తి సామర్థ్యాలతో తల్లిని అధికార స్థానం నుంచి తొలగించే సమయం అసన్నమవటం, నిశ గ్రహిస్తుంది. 'లేఖ'ను చంపే ప్రయత్నంలో 'నిశ' కూడా ఓల్గానదిలో మునిగి ప్రాణాలు కోల్పోతుంది. వీరిద్దరి తర్వాత బలాఢ్యురాలైన 'రోచన' అధికారంలోకి వస్తుంది. తరువాత కథ 'దివ' కాలంలో, యీ 'గుంపు' ఓల్గా నదీ తీరం వదిలి తూర్పుగా ప్రయాణం మొదలు పెడుతుంది. పశువులు కాయడం తప్ప యింకోటి తెలియని వీరిలో కొందరు క్రమంగా గోధుమలు పండించడం, రాగి అయుధాలు చేయడం నేర్చుకుంటారు.

దాదాపు యిదే సమయంలో, అంటే యిప్పటికి నాలుగు వేల సంవత్సరాల నాడు మెసపొటేమియా (ఇప్పటి యిరాక్‌లో) నుండి అబ్రహాం తన అనుచరులతో, గొర్రెలతో పశ్చిమంగా ప్రయాణిస్తాడు (ఓల్డ్ టెస్టమెంట్). వారి గమ్యం మధ్యధరా సముద్రతీరంలోని కెనాన్ ప్రాంతం. వారు అక్కడ జుడాయిజమ్‌నీ, తూర్పువైపు పయనించిన యీ గుంపులు భారతదేశంలో వైదిక సంస్కృతినీ ఆరంభించారు. అయితే ఆర్యుల 'గుంపులు' అప్పటికే యీ ప్రాంతాలలో నివసిస్తున్న 'అసురుల'తో యుద్ధాలు చేసినా, రెండు జాతులను అద్వితీయంగా సమ్మిళన పరచి అనన్య సామాన్యమైన వైదిక నాగరికత ఒకటి సృష్టించబడింది. అయితే యిది ఒక్కరోజులో జరిగిన పనికాదు. సింధు తీరంలో అసురులు గొప్ప ధనసంపదలతో నగరాలు నిర్మించుకొని పాలిస్తూ వుండేవారు అప్పటికి నూలుబట్టలు నేయడం, బంగారు ఆభరణాలు చేయడం, లోహంతో ఆయుధాలు చేయడంలో కుశలులు. కాని, వారి రాజు నిరంకుశుడు నిరంతరం దాసదాసీలతో భోగభాగ్యాలతో మునిగి తేలుతూ వుండటం వారిని బలహీనులను చేసింది. వారి రాజధాని పుష్కలావతికి ఆర్యులు వ్యాపారం కోసం వస్తూ పోతూ, అదునుచూసి నగరాన్నే కాల్చివేశారు. ఇది మొదలుగా అసురులు లేక ద్రావిడజాతి తమ ప్రత్యేకతను క్రమంగా కోల్పోతారు.

దివోదాసు, అతని కుమారులు సుదాసుల కాలంనాడు ఋగ్వేదరచన ఆరంభమైనదని సూచిస్తున్నారు రాహుల్‌జీ. (క్రీ. పూ. 1500).

'ప్రవాహణుడు' అనే కథ క్రీ.పూ. 700 నాటిది. అప్పటికి వేదాలు వల్లెవేయడం విద్యాభ్యాసంలో తప్పనిసరి భాగం. పాంచాలరాజు ప్రవాహణుడు

'బ్రహ్మతత్వము' అనే కొత్త సిద్ధాంతం ప్రతిపాదిస్తాడు. 'దీని అవసరమేమిటి?' అని అడిగిన భార్యతో 'ఇదీ రాచ కార్యంలో భాగమే' అంటాడు.

'అది (బ్రహ్మస్వరూపం) ఆకాశం లాగా చూసేదీకాదు, వినేదికాదు — మేము చూస్తే తప్ప, వింటే తప్ప విశ్వసించము అనే సందేహవాదులకిది గొప్ప జవాబు - నా నిర్వచనం - ఇంద్రియాలతో దర్శించలేము అనేదానికి తిరుగులేదు - అని గర్వపడతాడు ప్రవాహణుడు భార్య లోపా ప్రశ్నిస్తుంది "ఇదంతా ప్రజలను భ్రమలో పెట్టి వుంచడానికేనా ?"... గంగా యమునల మధ్యదేశంలో ఉపనిషత్తులలోని బ్రహ్మజ్ఞాన రచన ఆరంభమైంది.

'ప్రభ'లో అశ్వఘోషుని ఉదంతం వున్నది. గ్రీకు విషాదాంత నాటకాలని చూసిన ప్రభావంతో 'ఊర్వశీ వియోగం' నాటకం రచిస్తాడు అశ్వఘోషుడు. అతని ప్రేయసి ప్రభ. నిజంగానే ప్రేయసితో వియోగం అనుభవించ వలసి వస్తుంది - ఆమె మరణం వలన. అప్పటికి ఆలోచనా పరులందరినీ బుద్ధుడి అనాత్మవాదం ప్రబలంగా ఆకర్షిస్తున్నది. అశ్వఘోషుడు బౌద్ధ భిక్షువై 'బుద్ధచరిత్రము', 'సౌందర నందము' అనే గొప్ప కావ్యాలు రచిస్తాడు.

'సౌపర్ణ యౌధేయుడు' లోని సౌపర్ణుడు కాళిదాసు శిష్యుడు. కాళిదాసు రాజభోగాల నాశించి, తన కావ్యాలలో గుప్త చక్రవర్తులను పొగుడుతూ రాశాడనీ, రాజులుచేసే పాతకాలు ధర్మబద్ధమని పొగిడాడనీ సౌపర్ణుని చేత కాళిదాసుని నిందింప చేస్తారు సాంకృత్యాయన్. అట్లాగే హర్షుని కొలువులో వున్న బాణుని మీద కూడా యిటువంటి అభియోగాలే చేయబడినాయి.

క్రీ. శ 1200 నాటికే యిస్లాము మత అనుయాయులు భారతదేశంలో ప్రవేశించారు. సింధుప్రాంతం హర్షుడు చనిపోయిన వందఏళ్ళకే వారి అధికారంలోకి వచ్చింది (8వ శతాబ్దం). హిందూరాజుల్లో భోగలాలసతే తప్ప, క్షాత్రం ఏ కోశానా మిగలకుండా పోయింది. జయచంద్రుడు అటువంటి వారికి ప్రతీక. అతని ఆస్థానకవి శ్రీహర్షుడు గొప్ప వేదాంతి, పండితుడు. కాని జయచంద్రుని ఋజు మార్గంలో పెట్టడానికి ప్రయత్నం చేయలేదు.

తరువాత కథలు క్రమంగా యిరవయ్యో శతాబ్దం వరకూ సాగుతాయి. అన్నీ చదివాక సుదీర్ఘమైన భారతదేశ సంస్కృతీ ప్రవాహంలో తలమునకలుగా యీదినట్టు అవుతుంది.

చాగంటి తులసి అనువాదం, రాహుల్‌జీ శైలిలోని ప్రత్యేకతనూ విశిష్టతనూ తెలుగు పాఠకులకు అందజేస్తూ సాగింది.

హిందీలో మొదటి ముద్రణ 1942 లో జరిగింది. మొదటి ముద్రణ ప్రతులన్నీ ఏడెనిమిది నెలలలోనే చెల్లిపోయాయట .... ప్రతి గ్రంథాలయంలోనూ వుండ వలసిన పుస్తకం.

—సరోజినీ ప్రేమ్‌చంద్

కొత్త రుచులు

# ఆప్కో చేనేతలు

విశిష్టమైన రూపకల్పనల్లో నాణ్యమైన చేతి అద్దకపు అద్భుతాలు
ఈ తరుణంలో మీ అభిరుచులకి అనుగుణంగా ఎన్నెన్నో
రకాలు అధునాతనమైన నేతల్లో సాంప్రదాయపు సొంపుల్లో
కళ్ళు జిగేలు మనిపిస్తాయి   అన్ని సందర్భాలలో సరిపోయే
సరికొత్తరకాల్లో ఆప్కో చేనేతలు.
అపూర్వ కళాఖండాలను బోలు గుంటూరు, గద్వాల,
వెంకటగిరి జరీ చీరలు, సిద్ధిపేట, ఉప్పాడ, కొత్తపల్లి
బుటా చీరెలు, పుట్టపాక, నారాయణపేట, ధర్మవరం,
పోచంపల్లి టై అండ్ డై చీరెలు, దుప్పట్లు, తువ్వాళ్ళు,
లుంగీలు, ధోవతులు, మరెన్నో చేనేతలు.
సామాన్య కుటుంబీకులకు పనికివచ్చే జనతా చీరెలు,
ధోవతులు, చౌక ధరలలో
కంటి కింపైన డిజైన్లలో పాలియెస్టర్ చొక్కాలు
మీకు దగ్గరలో గల ఆప్కో ఫాబ్రిక్స్ విక్రయశాలను నేడే దర్శించండి
'సులభ వాయిదాలపై అమ్మ సౌకర్యం గలదు.'



ది ఆంధ్రప్రదేశ్
స్టేట్ హేండ్లూం వీవర్స్
కోఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్
హైదరాబాద్-500029

సీరియల్

# భ్రమర గీతం

## అచ్యుతవల్లి

గడిచిన కథ చలపతిరావు వృద్ధిలోకి రావడానికి, యమ్ ఎ బియెల్ పాసవడానికి భ్రమర తాతగారు రామ జోగిపంతులు ఎంతో సహాయ పడ్డారు. భ్రమరపై అతనికి అనురాగం లేక పోలేదు కాని, వేళ్ల మధ్య నుంచి జారిపోతున్న సౌందర్యాన్ని ఎలా పట్టుకోవాలో బోధపడటం లేదు ఇక చదవండి.

"ఎందుకు వంట, హోటల్‌కి పోతాలే!" అన్నాడు చలపతి.

"ముందు టీ పెట్టనీయి" అంటూ 'టీ' చేసింది. కప్పుల్లో పోస్తూ "అల్మెరాలో బిస్కట్సున్నాయి పట్రా" అంది.

"అఖ్ఖర్లేదులే!" అన్నాడు. తనే లేచి రెండు బిస్కటు పాకెట్సు తెచ్చింది. ఇద్దరూ నాలుగు నాలుగు క్రీం బిస్కట్సు తిని కప్పు కప్పు 'టీ' తాగారు. ఇంకా మిగిలిన 'టీ'ని ఫ్లాస్కుల్లో పోసింది.

"ఇంకా ఎందుకు 'టీ'?" అన్నాడు.

"అతిథి దేముళ్ళున్నారు కదా!" అంటూ కూరలు ముందేసుకుంది తరగటానికి.

"ఏమిటి మెస్ రన్ చేస్తున్నావా?" అన్నాడు.

"ఏదో వక కాలక్షేపం - నాకు ఆ సాపులమ్మట తిరిగే ఉద్యోగం కన్నా ఈ ఉద్యోగమే బావుంది ఇల్లు కదలనక్కర లేదు. బోలెడంత లీజరు దొరుకుతుంది"

"నీ కెందుకింత శ్రమ, భ్రమరా? ఇంటికి వచ్చేసి హాయిగా వుండ కూడదా?"

"పతీ, ఇంటికి వస్తాను. ఎవర్నో ఒకరిని పెళ్ళి చేసుకుంటాను. పిల్లల్ని కంటాను. ఆ తర్వాత అతను వదిలేసి పారిపోతాడు. ఆస్తి అంతా ఖర్చు పెట్టేస్తాడు. అప్పుడయినా నా బ్రతుకు నేను బ్రతకాలిగా - ఈ ఆడాళ్ళల్లో లోపమంతా ఎక్కడుందో తెల్సా?"

"ఎక్కడ వుంది?"

"ఆలోచనల్లో వుంది. తమ బాధ్యతని ఇంకొకళ్ళ చేతుల్లో పెట్టేసి నిశ్చింతగా కూర్చుంటారు. తేడా పాడాలు వస్తే భోరు భోరు మంటూ ఏడుస్తారు. భర్త వదిలేసిన భార్యలు ఏడుస్తూ కూర్చుంటారు. గతిమతి లేని వాళ్ళల్లా తయారవుతారు. భార్య ఒకవేళ వదిలేసి వెళ్ళిపోయిందనుకో, భర్తలు అల్లా బీమారీలు అయిపోతారా? భర్త వదిలేసిన ఆడవాళ్ళని,

క్షన్నవాళ్ళు కూడా ఈసడించుకుం టారు. భార్య వదిలేసిన మగాడ్ని అం దరూ భార్యలేని లోటు కనబడకుండా అపురూపంగా చూస్తారు."

"అందుకని ఏం చేయాలంటావు!"

"స్త్రీలు తమని గురించి తామే ఆలోచించుకోవాలి. ప్రతి దానికీ చేతులు ముడుచుకుని కూర్చోకూడదు తమ బ్రతుకు తాము బ్రతక గలమనే ధీమ వుండాలి"

"అయితే పెళ్ళి, కుటుంబ జీవనం వుండకూడదంటావా ?"

"ఉండకూడదని నేను అనటం లేదు. పరీక్ష పోతుందేమో అని చదువే మానేయమంటానా ? వరదలు వస్తే పంటలు పాడయిపోతాయేమో అని సరు పోయవద్దంటానా! ఒకవేళ సంసార జీవితం ఓటి పడవ ప్రయా ణంలా వుంటే బెంగటిల్లి పోయి మంచం పట్టి మరణించాల్సిన అవసరం లేదు - అంటాను. ఇంకొక రకంగా మనం జీవించాలి. ఇంకో విధంగా సంతోషంతో బ్రతుకుని వెలిగించాలి. అరటికాయలు దొరకకపోతే బీరకా యలు ఎల్లాగయితే వండుకు తిం టామో అల్లాగే జీవితం కూడా జీవించ టానికి అనేక రకాలయిన మార్గా లున్నాయి. పెళ్ళి పేరంటం. ఇల్లు సం సారం ఇవే జీవితానికి మార్గదర్శకాలు కావు. వైవిధ్యమయిన జీవిత మార్గా లున్నాయి. అవి తెలుసుకోగలిగి ఆచ రించ గలిగితే స్త్రీ మగవాడికి కట్టు బానిసలా పడివుండాల్సిన అవసరం లేదు" అంది భ్రమర. చలపతి



తన స్వాతంత్ర్య కవితా గానంతో జ్యోతి ని ఉత్తేజపరిచిన తమిళకవి రామలిం గంపిళ్లై శతజయంతి సంవత్సరమిది.

మాట్లాడలేదు భ్రమరలో తనకి తెలి యని రహస్యం ఏమీ లేదు. అన్నీ చెప్పేసినట్లే వుంటుంది. ఆవిడ అంటే తనకి లాలస వుంది కాని అమ్మలాగ ఇరుగుపొరుగు ఇల్లాళ్ళలాగా ఒక గృహిణిగా ఆవిడకి తన మనస్సులో ఒక చిత్రకల్పన చేయలేకపోతున్నాడు. అతనికి భార్య ఇల్లా వుండాలి అన్న కోరికలు లేవు. కాని ఎల్లాగ వుండాలో తెలుసును. చదువు, పరీక్షలు ప్యాసు కావటం, తండ్రిగారు, అతని ప్రపంచం లోని అవసరాలు కాగా, కారు మేఘంతో భ్రమర తనని క్రమ్మేసే దాకా అతనికి స్త్రీ అవసరం ఇది కూడా అని తెలియదు. తనకి ఒక స్త్రీగా భ్రమర చాలా తెలుసును. కాని భార్యగా భ్రమర తన జీవితం పంచు కోగలదా? తను ఎడ్జస్టు అయినట్లు ఆవిడ తనతో ఎడ్జస్టు కాగలదా?

"ఏమిటలా ముంగిలా కూర్చు న్నావు ?" అంది భ్రమర

"నీ మాటలు ఆలోచిస్తున్నాను" అన్నాడు

"ఏమిటంత ఆలోచన ? భ్రమరని పెళ్ళి చేసుకుంటే సంసారం రోడ్డు, మీద పడుతుందనుకుంటున్నావా ?' తన మనస్సులో మల్లాగుల్లాలు పడు తున్న సంగతి భ్రమర ఎంత తేలిగ్గా బయటికి లాగేసింది

"నన్నంత తేలిగ్గా అంచనా వేసు కుంటున్నావా ?"

"లేదు, కాని ధైర్యం తక్కువ. వసంత్ వున్నాడు అతనికి చూపు ఆకాశం మీద వుంటుంది. నన్ను ఆసరాచేసుకుని నింగిలోని చుక్కలని తాకాలని ప్రయత్నించుతాడు నారంగ్‌ది పిచ్చి ఆరాధన. జీవితానికి మరీ అంత భావుకత్వమూ పనికిరాదు. భావుకులు చివరిదాకా నిలబడలేరు మా నాన్నగారి పోలికలు కనబడుతున్నాయి అతనిలో" అంది

"వాసవ్ సంగతేమిటి ?" అనేసాడు.

"నిజం చెబితే నమ్మవు కదూ, బాలా పసిపాప లాంటివాడు"

"నమ్మలేక కాదు నీ అభిమానం చూరగొన్న వాడిలో ఒక ప్రత్యేకత వుంటుందనే నా నమ్మకం"

"అంత ప్రత్యేకత నాకు కనబడదు. అస్సలు ఎవరికీ కనబడదు"

"తనదనుకున్న అమ్మాయి ప్రేమ, ఆదరణ పొందాలంటే ఏమి చెయ్యాలి ?"

ముస్తాబులో మార్పు!
సరిక్రొత్త ఆకర్షణీయమైన సీసాలలో
లోధ్ర
ప్రకృతి సిద్ధమయిన
ఆరోగ్యమును స్త్రీలకు
80 సంవత్సరములుగా
ఇచ్చుచున్నది
ఉచిత వైద్య సలహాకు ఈ కూపనును
పూర్తిచేసి మా కాబితో పంపండి
పేరు: ____________________
PIN______
Lodhra
ఏజెంట్లు:
సీతారామ్ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్,
విజయవాడ - సికిందరాబాద్
కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14

"డిష్యుం డిష్యుం అంటూ పిడి గుద్దులు వేసి రక్షించుకోవాలి"

"ఎవరితో పోట్లాడాలి? నాకు అసలే భయం ఎక్కువంటావుగా!"

"ప్రత్యర్థులతో పోట్లాడాలి!"

"ఎవరా ప్రత్యర్థులు?" అంటున్నాడు. భ్రమర తనకి బాగా దగ్గిరవుతోంది తమ ఇద్దరి మధ్యా వేరెవ్వరూ లేరు - అనుకున్నాడు.

"నువ్వెప్పుడు దిగావ్ భాయి?" అన్నారు నారంగ్, వసంత్ పాటిల్.

"సాయంకాలమే? మీరెప్పుడు కలిసిపోయారు ఆవిడతో!" అన్నాడు చలపతి

"రండి రండి. కబుర్లు తర్వాత" అదిలించింది భ్రమర. ముగ్గురికీ భోజనాలు వడ్డించింది. ఆదరబాదరాగా తినేసి ముందు గదిలో సోఫాలో కూలబడ్డారు. ప్రక్కనున్న వాటాలలోంచి నలుగురయిదుగురు మగవాళ్ళు వచ్చారు. అందరూ చతుర్ముఖ పారాయణం మొదలుపెట్టారు. స్టేకు రూపాయి చొప్పున ఆట! షో అయినప్పుడల్లా షో చేసినవాడు అయిదు రూపాయలు భ్రమరకి నజరాగా ఇస్తున్నారు అప్పుడప్పుడు 'టీ'లు సిగరెట్లు సరఫరా చేస్తూంది. భ్రమర ముప్ఫయి అయిదు రూపాయలు అల్మైరాలో వుంచి తాళం వేసింది. రెండు గంటలు దాటింది అప్పుడే! నారంగ్ వసంత్‌లు సోఫాలో అడ్డదిడ్డంగా పడుక్కుని వున్నారు బెడ్‌రూంలో డబుల్ కాట్ మీద అడ్డంగా పడుక్కున్నాడు చలపతి. బాగా నిద్దరలో వున్న చలపతి



మైథిలీ శరణ్ గుప్త పేరు వినని వారెవరు? హిందీలో ఆయన కవితా ధార అపూర్వం. ఆ స్వాతంత్ర్య వీరుని శతజయంతి సంవత్సరమిది

వీపు మీద ముఖంతో రుద్దింది భ్రమర. చటుక్కున లేచాడు.

"టయిమెంతయిందీ?" అన్నాడు.

"మూడు దాటుతోంది. ఏమిటా అడ్డదిడ్డం పడక చిన్న పిల్లాడిలా! నీ మంచం మీద నిలువుగా పడుకో"

"అలసటగా వుంది. నిద్ర ముంచేసుకుని వచ్చేసింది. అవునూ, వీళ్ళని జూదగాళ్ళల్లా తయారు చేసేవేమిటి?"

"నేను తయారు చేసేనా? అవసరమే అన్నీ నేర్పుతుంది. దురద వేస్తే వీపు గోక్కోవటం ఎంత సహజమో, అవసరానికి అరికంగా ఆరించాలనుకోవటం

కూడా అంతే సహజం! పగలంతా వేటగాళ్ళు, రాత్రిళ్ళు జూదగాళ్ళుగా తయారయినారు నీ రూంమేట్లు"

"నీకేం లాభం? ఇల్లాంటి చెత్తా చెదారంను ఇళ్ళలో జేరనీయకూడదు. వచ్చినవాళ్ళు నీ మీద చీప్ జోక్స్ వేసి విక విక లాడిపోతుంటే నా కంది కంపల్లో కాల్చినట్లు అయి పోయింది మరీ వచ్చేరాగానే పోట్లా టెందుకు అని వూరుకున్నాను"

"అవునూ మర్యాద అంటేఏమిటి?"

"అంటేనా, సలక్షణంగా పెళ్ళి పేరంటం చేసుకుని ఇల్లు వాకిలీ చూసుకుంటూ వుండటం"

"వీళ్ళంతా గృహస్థులే! మర్యాద స్తులే! వాళ్ళందరికీ సంసారాలున్నాయి. వాళ్ళ వాళ్ళ వూళ్ళల్లో పిల్లలున్నారు. ఒకొకళ్ళకి ఇద్దరు ముగ్గురు 'పాప'లు కూడా వున్నారు పెద్ద పెద్ద ఉద్యో గాలలో వున్నారు. అయినా జూద మాడటానికి వచ్చారు. వెలది జూదంబు వేట పానంబు అంటూ సప్త వ్యసనాల లోనూ జూదానికి సెకండు ప్లేసు ఇచ్చారు. జూదగాళ్ళు గౌరవనీయులు అవుతారా ఎక్కడన్నా? ఇదుగో పతీ, వాళ్ళెల్లా మాట్లాడితే మనకేం! వాళ్ళు సరదాగా ఆడుకుందుకు షల్టరిచ్చాము. దాని వల్ల మనకి వచ్చే నష్టం ఏముంది?"

"నష్టం ఎందుకు లేదు? వాళ్ళ పెళ్ళాలు నీకు ఎన్ని శాపనార్థాలు పెడు తున్నారో! చక్కగా చదువుకున్నారు నారంగ్, వసంత్‌లు. వాళ్ళని కూడా జూదగాళ్ళ క్రింద తయారు చేసావు"

"బాగుంది, పతీ! ఇది మరీ బాగుంది. నెలరోజుల క్రితం నువ్వేగా వాళ్ళని పరిచయం చేసావు అంతకుముందు వాళ్ళెవరో నాకేం తెలుసును? మీ హాస్టల్స్‌లో జూదమే నేర్చుకున్నారో, పానమే నేర్చుకున్నారో నాకేం తెలు సును? నువ్వెళ్ళినాక రెండు మూడు సార్లు షాపింగ్ సెంటర్లో కలిసారు. బాగుండదని నీకు స్నేహితులు కదా అని ఇంటికి రమ్మని పిలిచాను"

"అంటుకు పోయారు" అన్నాడు పతి కోపంగా. అతని జుట్టు గుప్పిటిలో బిగించి ముఖంలో ముఖం పెట్టి:

"నువ్వేమిటి ఇంతలా తయా రయ్యావు?" అంది

"అబ్బ వదులు, తలనొప్పి వుడు తుంది" అన్నాడు అతని ముఖం ఆమె ముఖం దగ్గరయింది. నాలుగు కళ్ళూ కలుసుకున్నాయి. చూపుల్లో చూపులు సూదుల్లా గుచ్చుకున్నాయి

నేను మంచిదాన్ని కాను. సరేనా! అయినా నేను రమ్మనగానే తోక ఆడించుకుంటూ ఎందుకు వచ్చావయ్యా బ్రాహ్మడా?" అంది నవ్వుతూనే.

బుద్ధిలేక గడ్డితినే వచ్చానులే" ఉక్రోషంగా అన్నాడు. ఆమె గుప్పెటి లోంచి జుట్టు వదిలించుకుని గోడ వెంపు ముఖం పెట్టి వత్తిగిల్లి పడుక్కు న్నాడు. అతని వీపుని కావిలించుకుని కాళ్ళు రెండూ అతని కాళ్ళమీద వేసి:

"పతీ, బుద్ధి లేకపోవడంలో సుఖ పడటానికి మార్గముంటె బుద్ధి లేకుం డానే వుందాము. గడ్డి తింటంలో ఎక్కువ రుచి వుంటే గడ్డే తిందాము

ఏం !'' అంది మెడ దగ్గర నోరు పెట్టి గుసగుసగా. కిటికి లోంచి మంద మారుతానికి పారిజాతం పూలు బల బల్లాడాయి. ఆ పరిమళానికి భ్రమర మాటలు, గొంతులోని స్వాధీనత చల పతిని మత్తులోకి ఈడ్చుకు వెళ్ళాయి. భ్రమర గుండెల్లో తలదూర్చి ఎప్పుడు నిద్రలోకి జారుకున్నాడో తెల్లవారి ఎంత సేపటికీ లేవలేక పోయాడు వంటింట్లో భ్రమర గోల గోలగా అరవటంతో కళ్ళు మంటలు పుడు తున్నా బలవంతంగా రెప్పలు తెరి చాడు. వసంత్ నారంగ్‌లు ఇద్దరూ లుంగీలు కట్టుకుని అటూ ఇటూ తిరుగు తున్నారు. వాళ్ళ మీద అథారిటీ చలా యిస్తున్నది భ్రమర.

"లేవయ్యా! శోభనం పెళ్ళి కొడు కులా ఏమిటా పడక ?'' అన్నాడు నారంగ్.

"కష్టపడి బ్రతకటానికి వచ్చావా, మనుగుడుపులకి వచ్చావా?'' అన్నాడు వసంత్

"పాటిల్ మహారాజ్, జోక్స్ తర్వాత! ముందు అరటికాయలు తరిగి ఇవ్వండి'' అంది భ్రమర.

"మీరు మెస్ రన్ చేస్తున్నా రేమిట్రా?'' అన్నాడు చలపతి గొంతు వరకు దుప్పటి లాక్కుంటూ

"ఇంక అదే మొదలుపెట్టాము. ఇక్కడ అరు రోజులు వంట చేస్తే పదిహేను వందలు 'పే' చేస్తారు తెలుసా ? వంట చేయటం అంటే ఏదో చీప్ అనుకుంటున్నావు కాబోలు! నువ్వు కూడా ఒక చెయ్యి వేసేవంటే మనం కుకింగ్ పార్టీగా ఏర్పడవచ్చును. నెలకి రెండుసార్లు ఒప్పుకున్నామంటె మూడు వేల రూపాయలు ఖాయం. నలుగురు పంచుకోవచ్చును'' అంది భ్రమర.




"లేలే పతీ, తొమ్మిదింటికంతా టికి తాళం పడెయ్యాలి ఉరో ఉరోయ్యార్!" అన్నాడు నారంగ్. ఎదురుగా గోడకి జేకోరాండు క్లాక్ పావు తక్కువ తొమ్మిది చూపుతోంది

"ఏం చేయాలి నేను" అన్నాడు పక్కమీంచే

"ఇవ్వాళ్టికి పనేమీ చెప్పము. నీ కాలకృత్యాలన్నీ తీర్చుకుని వేగం తెమిలి బయటు పడు బాల్నూ! రేప ట్నించీ వర్క్‌లో భాగం ఇస్తాము." చలపతి బద్ధకంగా లేచి బాత్‌రూం లోకి వెళ్ళాడు స్నానం అవీ కానిచ్చి బట్టలు వేసుకొని వచ్చేసరికి టమాటో బాత్ రెడీగా వుంది ఆవిర్లువస్తూ. కాఫీ కప్పు సాసరుతో నుంచుంది భ్రమర

"ఇది ఎవరికి?" అన్నాడు నారంగ్, కుర్చీ టేబుల్ ముందుకు లాక్కుని తింటానికి కుప్రమించుతూ.

"ఇది బ్రేక్‌ఫాస్టా?" అన్నాడు.

"ఇదే బ్రేక్‌ఫాస్టు, ఇదే లంచ్! రాత్రి పన్నెండుగంటల దాకా ఇదే ఆహారము మాకు" అన్నారు మిత్రు లిద్దరూ.

"అదేమిటి?"

"మాకు టయిమ్ వుండదు. ఇప్పుడు కడుపు నిండా తినేసి, మధ్యాహ్నం లంచ్ బ్రేక్‌లో ఆదరబాదరాగా ఆ చల్లారిన దేదో నోట్లో కుక్కుకుని ఇన్ని నీళ్ళు తాగేస్తాము"

"మరి నువ్వు?" అన్నాడు భ్రమ రతో.

"నేనూ అంతే. ఎవరైనా పుణ్యాత్ముడు వుంటే లంచ్ టయింలో భోజనం ఇప్పించుతాడు" అంది. వసంత్ నారంగ్‌లు టిఫిన్‌బాక్సులో కొద్దిగా టమాటో బాత్ పట్టుకుని వెళ్ళారు.

"నువ్వు కూడా పద" అంది భ్రమర

"ఎక్కడికి పద మంటావు?"

"లైబ్రరీకి వెళ్ళు లోకల్ ఎప్పాయింట్‌మెంట్సు వుంటే అడ్వర్టయిజ్‌మెంట్సు వేస్తారు. ట్రయి చేయవచ్చును" - ఈ సలహా నచ్చింది చలపతికి. రోజూ భ్రమరతో పాటే బయటికి వెళ్ళి లైబ్రరీలన్నీ తిరిగేవాడు. నెలరోజులు కూడా కాకుండానే ఒక కంపెనీలో సేల్స్ అసిస్టెంటుగా ఉద్యోగం దొరికింది

"కంగ్రాట్యులేషన్స్" అన్నారు మిత్రులు

"లక్కీయే! మంచి ఉద్యోగమే చిక్కించుకున్నావు" అంది భ్రమర. చలపతి ఎనిమిది గంటలకల్లా ఇంట్లోంచి బయటపడేవాడు. తిరిగి రాత్రి పది గంటలు దాటాక కాని అతను ఇల్లు చేరేవాడు కాదు. జీతం అందుకున్న రోజున అతనికి శరీరం అంతా చమటలు పోశాయి. అయిదువందల అరవయిరూపాయలు - తన ఇన్నేళ్ళ జ్ఞానార్జనకు ప్రతిఫలము అన్నమాట, తన కష్టార్జితం! తను ప్రయోజకుడు అయినాడు. ఇన్నిరోజులూ తన అవసరాలకి తండ్రి యాభయి, అరవయి చొప్పున పంపటము, అది ఎంతో క్లుప్తంగా వాడుకోవటం అలవాటు

అయ్యింది. చప్పున ఏదయినా అను కోని అవసరం వచ్చి తండ్రికి వ్రాస్తే - జాగ్రత్తగా చదువుకో, పొదుపుగా ఖర్చు చేయి - అనవసరమయినది కొనకు, అనే హితోక్తులతో పైకం పంపేవాడు ఇప్పుడు తను నిజంగా మగవాడు అయినాడు. లాయరుగా ప్రాక్టీసు ప్రారంభించినా, నెలకి అయిదువందలు సంపాదించుతాడని గ్యారంటీ ఏమీ లేదు. మొదట కనీసం రెండు మూడు సంవత్సరాలయినా బేస్ అవటానికి డబ్బు వుండాలి భ్రమర ఆడదయినా తెలివయినది. ఇది కాస్మోపాలిటిన్ సిటీ కనుక ఈజీ ఎర్నింగ్‌కి ఎన్నో మార్గాలుంటాయి. లార్జిస్కేలుమనీ సర్క్యులేట్ అవుతూ వుంటుంది. అందుకనే బ్రతకనేర్చిన వాళ్లంతా పట్నవాసాలకి ఎగబడు కున్నారు. అయిదువందల రూపా యల్లో ఒక నూటయాభయి రూపా యలు తనకి వుంచుకుని, చెల్లెళ్ళకీ, తల్లీ తండ్రికి బట్టలుతీసి, రిజిష్టర్డ్ పార్శిల్ చేసి ఇంటికి వచ్చేసాడు. మర్నాడుదయం కాఫీ త్రాగుతూంటే, "జీతం వచ్చిందా ?" అంది భ్రమర.

"ఊ" అన్నాడు

"ఏం చేసావు ?"

"మా నాన్నగారికి, అమ్మగారికి, చెల్లాయిలకి బట్టలు తీసి పంపించాను మొదటి జీతం కదా సంతోషపడతా రని !" అన్నాడు.

"అప్పుడే ఉద్యోగం వచ్చిందని ఇంటికి డప్పు కొట్టేసావా ? బలే



నీటి ఎద్దడి, ఎనర్జీ కొరత ప్రపంచ వ్యాప్తమైన సమస్యలు. నీటిని ప్రకృతి ప్రసాదిస్తుంది కాని, ఎనర్జీని మాన వుడు సృష్టించుకోవాలి. ఎనర్జీ వన రులు ఆనాటికానాడు తగ్గి పోతు న్నాయి. అణు విద్యుత్ సంపన్న దేశా లకేగాక, అభివృద్ధి చెందుతున్న దేశా లకి కూడా చాలా అవసరం.



వాడివే ! ఇదేమన్నా సరయిన ఉద్యో గమా ?"

"అయిదు వందల రూపాయలు పైగా జీతం వచ్చే ఉద్యోగం సరయిన ఉద్యోగం కాదా ? ఇంతకన్నా మంచి ఉద్యోగం ఎక్కడనుంచి వస్తుంది ?"

"నీ ముఖం లాగుంది. చదువు కున్నావన్న మాటే కాని లోకజ్ఞానం పూజ్యం. వొట్టి బుద్ధూవి ఎక్కడో ! ఈ ఉద్యోగం ఒక ఉద్యోగం కింద లెఖ్ఖనుకున్నావా ? పెద్ద పెద్ద కంపె నీలలో వాచ్‌మెన్‌లకు వస్తాయి అయి

# మాలతీ చందూర్

**నవలలు**

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 00 |
| ఏమిటీ జీవితాలు | 12 00 |
| మనసులోని మనసు | 25 00 |
| ఆలోచించు | 9 00 |
| రాగరక్తిమ | 18 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం, ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.. | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

**ఇవిగాక**

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 30 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |



20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు, ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.



**క్వాలిటీ పబ్లిషర్స్**

**రామమందిరం వీధి - విజయవాడ-2**

దేసి వందల రూపాయల జీతం! నీ సొదరు ఖర్చులకి వుంటాయని చేర మన్నాను. అప్పుడే ఉద్యోగస్థుడిని అయిపోయాను అని ఇంటికి వ్రాసే సావు. నాలుగయిదు నెలలు నిల త్రొక్కుకోవాలి. ఈ ఉద్యోగం డబ్బులో కొంచెం కొంచెం మిగిలించు కుంటే అప్లికేషన్స్ పెట్టటానికి, ఇంట ర్వ్యూలకి తిరగటానికి ఇంటికి వ్రాయ నక్కర లేకుండా సరిపోతుంది. ఇంక ప్రతినెల ఇంత పంపు, అంత పంపు, నీ జీతం ఏం చేస్తున్నావు? - అంటూ మీ నాన్న జాబులు వ్రాయటం మొదలుపెట్టారు. సరేలే నీ ఖర్మ! మెస్ బిల్లు కట్టాలి డబ్బు ఇవ్వు"

"మెస్ బిల్లా?"

"నాయనా నీ కన్నీ చెప్పాలి. నెలకి నూట యాభయి రూపాయలు మెస్ బిల్లు అవుతుంది"

"ఎక్కడా మెస్?"

"నీ నెత్తిమీద! ఎక్కడట ఎక్కడ? నెల్లాళ్ళపట్టీ ఎల్లా మెయిన్ టయిన్ చేస్తున్నాననుకున్నావు? నారంగ్ వసంతలు చెరిసగం ఇచ్చారు. ఒకొక్కళ్ళు డెబ్బయి అయిదు రూపా యలు. వాళ్ళది వాళ్ళకి ఇచ్చేయాలి. లేకపోతే ఏడ్చిపోతారు!"

"నాకు తెలియదిదంతా! నిజం భ్రమరా!"

"ఈ ఇంటికి అద్దె అయిదు వందల యాభయి రూపాయలు-వితౌటుకరెంటు చార్జెస్. నాకూ జీతం అయిదు వందలే వస్తోంది. వచ్చిందల్లా ఇంటి అద్దెకే కట్టేసి నేనేమి తినాలంటావ్?"

"అందుకనేనా!"

"అవును. వీళ్ళని పేయింగ్ గెస్టు లుగా వుండమన్నాను. మూడేసి వందలు ఇస్తారు. ఉదయం నాస్తా కాఫీ, రాత్రిళ్ళు డిన్నరు. పెట్టె బేడా దాచుకుందుకు చోటు. బయట విడిగా వస్తుందేమో చూడు! వేరే గది కావా లంటె నూట యభయి రూపాయలు తినేస్తుంది రాత్రి కొంచం సేపు పడుక్కుందుకు, ఒక పెట్టె పరుపు చుట్టా పెట్టుకునేందుకు నూట యాభయి రూపాయలు ఎందుకు పోగొట్టుకోవడం? ఆ డబ్బు అదాయే కదా వీళ్ళకి!" అంది భ్రమర.

"నీకున్న ఆలోచన నాకు లేదు భ్రమరా! అందుకనే జీతం రాగానే సంబరంగా వాళ్ళకి అన్నీ కొనేసాను. నావద్ద ఇంక డబ్బు కొంచెం మిగు లుంది. అది ఇచ్చేస్తాను తీసుకో! ఇంక నెలనెలా వాళ్ళల్లాగానే నేనునీకు డబ్బు ఇచ్చేస్తానులే!" అన్నాడు ఖిన్నుడై.

"ఈ చిన్న ఉద్యోగంలో రాటయి పోకు, నీకింకా బోలెడు భవిష్యత్తు ముందు వుంది. అందాకా నీ చేతికి డబ్బు కావాలి కదా అని ఇల్లాంటి ఉద్యోగంలో చేరినా ఊరుకున్నాను. ఇంకా ఇక్కడ వుంటూ మీవాళ్ళని డబ్బు పంపమనటం బాగుండదు కదా!" అంది భ్రమర. చలపతి చిన్న బుచ్చుకున్న ముఖంతో వుండటం భ్రమరకి బావుండలేదు. అంచేత అంది;

"పతీ, బి ఇన్ ఫెస్టివల్ మూడ్! వాళ్ళు వచ్చేస్తారు. ఇవ్వాళ నీకు జీతం వచ్చిందిగా, సెలబ్రేట్ చేసుకుందాం!"

"ఏం చేద్దాం?"

"ఇంట్లో వంట వండను. టౌనుకి పోయి ఏదన్నా మంచి ఏ సి. హోటల్‌లో డైన్ చేద్దాము. తర్వాత పిక్చరుకి పోదాం, ఏం ?"

"అల్లాగే నీ ఇష్టం" అన్నాడు. భ్రమర తెలివయినది. కష్టసుఖాలలో తనకి ఆలోచన చెప్పగలది. ఇల్లాంటి ఆవిడ సహకారం తనకి వుంటే ఎంతయినా పైకి రాగలను - అనుకున్నాడు చలపతి. లక్ష్మణరావు ఖాయిలా పడ్డానని జాబు వ్రాసాడు. మునుపట్లా లేచి తిరగలేకపోతున్నాడు. రామజోగి పంతులు పొలాలన్నీ బితకపండాయి మన అన్నవాళ్ళ దగ్గిర లేకపోతే సగానికి సగం పంటకూడా చేతికి దక్కనివ్వరు. చలపతి సాయం ఇంటా బయటా కూడా తనకి అవసరం - అన్నధోరణిలో వుంది అయన జాబు

"వెళ్ళక తప్పదంటావా ?" అంది భ్రమర.

తప్పదేమో అన్పించుతోంది - అసలు మానాన్న అంత డీలాగా ఎప్పుడూ వ్రాయరు. అందులో స్వంత భూములు కూడా కావు. అన్నీ మీ తాతగారివే ! చూస్తూచూస్తూ అంత పంటని పరాయివాళ్ళకెందుకు ధారపోయటం ?"

"మా తాతగారు ఇంకో మనిషిని చూసుకోలేరా ? మీ నాన్నగారికి ఆ ఆస్తి మీద అజమాయిషీ వేరొకరికి అప్పజెప్పటం ఇష్టం లేదు. విన్నెల్లాగో తన కళ్ళ ఎదుట కట్టేసుకోవాలని ఆయన తాపత్రయం" అంది కోపంగా.

తండ్రిని అంత దిగాలుగా మాటాడితే చలపతికి కోపం వచ్చింది. తండ్రి కష్టనష్టాలు అతనికి తెలుసును. ఆర్జన అంటూ లేకుండా ఒక చిన్ననాటి కొంపతో ముగ్గురు పిల్లలనీ, భార్యనీ ఏ అపమార్గాలూ పట్టకుండా పోషించుకు వచ్చాడు. వీళ్ళ ఆస్తిఅజమాయిషీ లేని రోజుల్లో తన తండ్రి తమని పోషించలేదా ? ముఖం అవమానంతో ఎర్రబడింది. కానీ భ్రమరని సూటిగా ఏమీ అనలేడు,

* * *

"చలపతి ఎందుకు"

"చలపతి ఎందుకు వెళ్ళిపోయాడు ? ఎదో ఉద్యోగం చిక్కించుకున్నాడుగా !" అన్నాడు వసంత్

"వాళ్ళ నాన్నగారు వచ్చేయమన్నారుట" అంది భ్రమర.

"ప్చ ! ఆంధ్రాలో ఆంధ్రావాళ్ళకి మంచి నీళ్ళు కూడా పుట్టవు. పొట్టలు చేతపట్టుకుని ఇంతదూరం ఎందుకు వస్తూవుంటారు ?" అంది భ్రమర మళ్లీ.

"ఏ రాష్ట్రంలో ఆ రాష్ట్రం వాళ్ళకి ఉపాధి కల్పన వుండాలి. ఒక రాష్ట్రం వాళ్ళు వేరొక రాష్ట్రంలోకి వచ్చి వాళ్ళని డామినేట్ వేయటం మానుతారు అప్పుడు" అన్నాడు నారంగ్.

"నిన్ను ఎవరు డామినేట్ వేసారు ఇప్పుడు" అంది భ్రమర.

"నన్నెవరూ డామినేట్ చేయలేరు" అన్నాడు నారంగ్ గర్వంగా. వసంత్ పాటిల్ నవ్వాడు. చలపతి వెళ్ళిపోవటం వసంత్ నారంగ్ లిద్దరికీ బాలా హాయి కలిగించింది. భ్రమరకి చలపతి

అంటే మక్కువ వున్నాదని తెలుసును. చలపతి ఒట్టి పిరికిపీనుగు. ఇంత డేషింగ్ గర్ల్ వేయిఇస్తూంటె చవట సన్యాసిలాగా పరుగుపెట్టాడా? ఆంధ్రా ఆంధ్రాయే, అనుకున్నారు వాళ్ళకి చలపతి వెళ్ళిపోవటం ఒక గుదిబండ తొలగించుకున్నట్లే వుంది.

లక్ష్మణరావు బాగా ఖాయిలా పడి పోయాడు. మునుపట్లా లేచి తిరగ లేకపోతున్నాడు. వసుధ చలపతి లాగానే నాజూకుగా తయారయ్యింది. అనసూయకు కొడుకు అంత దూరం వెళ్ళిపోతే సంసారం ఎల్లా జరుపుకు రావాలా అనే బెంగ - చిక్కి సగం అయిపోయింది లక్ష్మణరావు తిరు గుతూ వుంటే ఒక ధైర్యంగా వుండేది ఇప్పుడు తనూ ఆడపిల్లా తిరిగి ఇంటా బయటా నిర్వహించుకు రాలేరు అని భయం

చలపతి వచ్చి దగ్గర కూర్చున్న ప్పుడల్లా మళ్ళీ ఆ మారుమూల ఊరికి వెళ్తానంటాడేమో అని లక్ష్మణరావు మనస్సు గుబగుబలాడేది. చలపతి ఆ ప్రస్తావన తేకపోవటంతో "అమ్మయ్య!" అనుకునేవాడు. ఇన్నాళ్ళూ ఎల్లాగో జరుపుకు వచ్చాడు. వాడి బాధ్యత వాడు తెలుసుకోవాలి. ప్రేమ అన్నది వెల్లువలా పొంగాలి. తమని గాలికి వదిలి తన సుఖం తాను చూసుకుంటే ఎవరు ఆపగలరు? కూర్చుని తింటూ వుంటే గుడులు మడులు తరిగిపోతాయి. తనే కలగజేసుకోవాలి అనుకుంటూండే వాడు.

"సెలవలు బాగా వాడేసాను నాన్నా! ఇప్పుడు వెళ్ళితే నాకిచ్చిన పోస్టు వుంటుందో వుండదో!"

"పోనీ ఇక్కడ్నే ఏదయినా వర్క్ చూడమంటాను తాతయ్యగారిని"

"అన్నిటికీ వాళ్ళనే ప్రాధేయపడ టం నాకు సిగ్గు వేస్తుంది, నాన్నా మిమ్మల్ని వదిలి వెళ్ళాలంటే మనస్సు ఒప్పటంలేదు మళ్ళీ అక్కడ అంత తేలిగ్గా జాబ్స్ దొరకవు"

"చలపాయ్!" అంటూ కొడుకుని దగ్గరగా తీసుకొని కళ్ళనీళ్ళు పెట్టు కున్నాడు లక్ష్మణరావు తండ్రి గుండె లకు హత్తుకుపోయాడు చలపతి ఆ క్షణంలో తండ్రి తనకి మొక్కజొన్న కండెలు, తేగలు, సీతాఫలాలు జామ పళ్ళుతెచ్చి ముందుగా తనని ఎత్తుకుని ఇచ్చే రోజులు గుర్తు వచ్చాయి. తండ్రి ఖాయిలా పడిపోయాడంటే నిశ్చయంగా తనమీద బెంగపెట్టుకుని వుండటం వల్లనే అని చెప్పవచ్చును. అక్కడ ఉద్యోగం దొరికిందనగానే ఇంక అక్కడే సెటిల్ అయిపోతాడనే దిగులు వచ్చింది తల్లి తండ్రులకి! దానితో శారీరకంగా దిగజారిపోయాడు. ఇంక ఆ దిగులు తండ్రికి కలగనీకూడదు. కొడుకు పుట్టాడనగానే ఎంతో సంబర పడిపోతారు. పెంచి పెద్దచేసి వాడి విజయాలన్నిటికీ ఎంతో పరవశం చెందుతూ వుంటారు. ఏమి చేసి తల్లి తండ్రుల ఋణం తీర్చుకోవటం? కనీసం వాళ్ళ కళ్ళకి ఎదురుగా వుంటే సంతోషిస్తారు - అనుకున్నాడు చలపతి.

(ఇంకా వుంది

నాణ్యత మా తయారీ! ఖ్యాతి తెచ్చినది భారత ప్రజలు!!




# త్రివేణి

కోట్లాది ప్రజలు కోరుకునే
సుగంధ వక్కపొడి



త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో.,
మచిలీపట్నం-521 001

డైరీ

## 1987 సెప్టెంబరు 07

సరిగ్గా ఏభైఏళ్లక్రితం ఈ రోజున మైలాపూర్ బృందావన కాలనీలో ఏడు గురు పిల్లలతో శర్మాదంపతులు (డా॥ వి యన్ శర్మ, మిసెస్ ఎల్లెన్ శర్మ) స్థాపించిన చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు, యిప్పుడు రెండువేలమందికి విద్యాదానం చేస్తున్నది, శాఖోపశాఖలుగా విస్తరించింది, సంస్థాపకులైన శర్మాదంపతులు ఈనాడు లేరు ఏభై ఏళ్ల క్రితం రామకృష్ణమఠంవారి స్వామీజీ ఈ స్కూలుకి దీపారాధన గావించారు. అదే మైలాపూరు రామకృష్ణామఠం నుంచి మరొక స్వామిజీ వచ్చి, ఈ ఉదయం ఏడు గంటలకి ఎంతో పవిత్ర వాతావరణంలో జరిగిన ప్రార్థన సమావేశానికి దీపారాధన గావించారు. .... రామకృష్ణామిషన్ స్వామీజీయే కాదు, ఒక క్రైస్తవ ఫాదరీ, ఒక బౌద్ధభిక్షువు, ఒక ముస్లిమ్ మౌల్వీ ఈ నాటి ప్రార్థనలలో పాల్గొని, గీత, బైబిలు, ధమ్మపథం, కొరాన్‌లలోని సర్వమానవ సౌహార్ద్ర గీతకను దయా వాహినిలా పలికారు. శకుంతలాశర్మ ఆహూతులకు స్వాగతం తెలుపుతూ, తలిదండ్రులకు స్మృత్యంజలి ఘటించగా, పారిశ్రామిక వేత్త చిత్రా నారాయణస్వామి బృందావన కాలనీ రోజులు, అయిదు దశాబ్దుల అనుబంధమూ గురించి ప్రస్తావించారు. స్కూలు పురోభివృద్ధిలో సన్నిహితులైనవారు, శకుంతలాశర్మ అక్కగార్లు రుక్మిణి, గీత, కమిటీ మెంబర్లూ మున్నగువారు 51 ప్రమిదలు వెలిగించారు. ఎంతో స్వచ్ఛంగా, సుందరంగా, శర్మాదంపతుల స్వభావోన్నతకి మచ్చుతునకగా, సౌజన్య దీప్తులతో సాగిన ఈ ప్రాతఃకాల సమావేశం ప్రతి ఒక్కరి మదిలో నిలిచే చిరుకాంతి; మంచితనమూ మానవత్వమూ వేయిగుండెలలో గానమై పలుకుతుందనే ప్రత్యాక్షానుభూతి .... నితిన్, జయసుధా కపూర్ దంపతుల కుమారుడు నిహార్ పుట్టిన పండగ వేడుక అడయార్ గేట్ హొటల్లో. నెమ్మిది నెమ్మిదిగా అడుగులు వేస్తున్న ఆ అందాల బాలుని దీవించేందుకు పాత్రికేయులూ ప్రొడ్యూసర్లూ ఫామిలీ ఫ్రెండ్సూ వచ్చారు. కపూర్ దంపతుల కలల పంట నిహార్. ఆ చిరంజీవి శతాయుష్కుడవాలనీ, తలిదండ్రుల స్వప్నాలకు ప్రతిరూపం కావాలనీ అందరితోబాటు మేమూ ఆశీర్వదిస్తున్నాము.

## ..... 09

'ఆడిందే ఆట పాడిందే పాట, అంటూ సారంగాల తరంగాలతో ముచ్చట్లు పోతుంది రజనిబృందం

(సీతారామశాస్త్రి పాట - జానకి గాత్రం కోరస్‌తో) ... 'వయసా, నీకు తెలుసా, అధరాల అరుణోదయాలు' అని రాజేంద్రప్రసాద్, రజని ప్రశ్నించుకుంటారు (గీతరచన సీతారామశాస్త్రి - గాత్రద్వయం బాలు, సుశీల) ... గారాల కారాగారంలో పరిణయమే తగిన శిక్ష - అని చెప్పుకుంటారు మళ్లీ ఆ యిద్దరూ .. అరమరికలు లేని సంసారం అనుకూలంగా సాగినప్పుడే ఆనందమట (ఆత్రేయ) ఊగిపోతూన్న నడుం గురించి వగలుపోతుంది రజని .... 'చంపమంటారా, నామాట వచ్చినట్టు ఒప్పుకుంటారా ?' అని యింట్లో వాళ్లందరినీ బెదిరిస్తాడు రాజేంద్రప్రసాద్ (ఆత్రేయ రచన) .... 'గుడ్ లక్'తో ఈ ఉదయం మహేశ్వరీ. వారి 'భలేమొగుడు' లోని ఆరుపాటల చిత్రీకరణ చూపారు. రాజేంద్రప్రసాద్. రజనిలతో బాటు సత్యనారాయణ, గొల్లపూడి, రంగనాథ్ మున్నగువారున్నారు. 'కిన్నెర' అనే కొత్తమ్మాయి పరిచయమవుతోంది. నిర్మాత : వెంకన్నబాబు; దర్శకత్వం : రేలంగి నరసింహారావు. . . నిర్మాత కెవివి సత్యనారాయణ, సూపర్‌స్టార్ కృష్ణ హీరోగా, రవిచంద్ర దర్శకత్వంలో ఒక భారీచిత్రం నిర్మిస్తున్నారు. కథానాయిక రాధ. మోహన్‌బాబు, గొల్లపూడి మున్నగువారున్నారు. రచన : పరుచూరి బ్రదర్స్. మూడు షెడ్యూల్స్‌లో పూర్తిజేయనున్నామని అన్నారు సత్యనారాయణ ఈ సాయంత్రంవారి ఆఫీసులో జరిగిన పత్రికా గోష్ఠిలో.

.. "అంతవరకూ వ్యతిరేకత చూపిన జయవర్ధనె, ఇండో - శ్రీలంక ఒప్పందాన్ని అమాంత్రం ఎలా అంగీకరించారా అనే ప్రశ్న చాలామందికి కలగడం సహజం . పడవలపై ఆహార పదార్థాలు పంపినప్పుడు నిరాకరించిన శ్రీలంక, విమానాల ద్వారా అది డ్రాప్ చేస్తున్నప్పుడు, తన మేకపోతు గాంభీర్యం యిక చెల్లదని తెలుసుకొంది, అంతకీ తన సార్వభౌమత్వానికి హాని కలుగుతోందని చైనాతో, అమెరికాతో చెప్పుకొంది. ఐక్యరాజ్య సమితిలో ఫిర్యాదు చేదామనుకుంది. కాని ఎవరూ జయవర్ధనె పంపిన దౌత్య ప్రతినిధుల మాట సీరియస్‌గా ఆలకించలేదు సరిగదా, ఎత్నిక్ ప్రాబ్లెమ్ పరిష్కారానికి సాయపడుతున్న ఇండియాతో పేచీ దేనికి, కిరాయి సైనికులకి ఆశ్రయమిచ్చి సమస్యని మొండిగా మీరు మరింత జటిలం చేసుకుంటున్నారు — అని మొహంమీద అన్నారు.... హిందూ మహాసముద్రాన్ని శాంతిమండలంగా వుంచమని కోరుతున్న ఇండియా, శ్రీలంకలోని 'ట్రింకామలెని' మరొక దేశానికి సైనిక పరంగా ధారాదత్తం చేయబోతే, చూస్తూ వూరుకోదని శ్రీలంకపాలకులు గ్రహించారు ....శాంతి భద్రతలు నెలకొల్పా లేమని, యిప్పటికే అన్ని విధాలా ధ్వంసమైనదేశం సర్వనాశనం కాకూడదనీ, అనేక వొత్తిడుల

కారణంగా జయవర్ధనెలో వివేకోదయం కలిగింది మా వాళ్లు బెల్జియమ్ నుంచి ఉల్లిపాయలు కొనుక్కోవాలా – ఇండియాలో దొరకవా ? రెండున్నర రెట్లు చెల్లించి ఇంగ్లండు నుంచి ట్రక్కులు తెప్పించుకోవాలా - ఇండియాలోని 'టాటా బెంజ్' సప్లయి చేయదూ? ఇలా ఒకటేమిటి - దేశాన్ని దివాలా ఎత్తించే పనులు అనేకం చేశారు. పరిస్థితులు చెయిజారి పోవడంతో. తమిళుల న్యాయసమ్మతమగు కోర్కెలని యిక అణిచిపెట్టగల అస్కారం లేక, మూడున్నర సంవత్సరాలుగా జరుపుతున్న సంప్రదింపులకు శుభప్రదమగు మంగళవచనం పలికారు

శ్రీలంకలోని తమిళుల (ఉత్తర, తూర్పు ప్రాంతాలు) స్వయం ప్రతిపత్తివాదం భారత యూనియన్‌లోని భాషా ప్రయుక్త రాష్ట్రాలని పోలినది - అంతకిమించి ఏమిలేదు . సింహళంతో బాటు తమిళాన్ని అధికార భాషగా గుర్తించడం వొప్పందం షరతులలో ఒకటి. తమిళంతో బాటు ఇంగ్లీషుని కూడా అధికార భాషగా గుర్తించారు – అది మూడో మేలు.... ముప్ఫయ్యేళ్ల క్రితం, దూరదృష్టిలేని నాయకులు, తమిళాన్ని పక్కకి నెట్టి, సింహళం నెత్తిని రుద్దడంవల్లనే, ఈ గొడవలన్నీ వచ్చాయి.. ప్రభాకరన్ ఆదేశ ప్రకారం తిరుగుబాటు దారులు తమ ఆయుధాలని వొప్పగిస్తున్నారు. ఇండియాపట్ల మాకు సంపూర్ణ విశ్వాసం ఉంది— ఈ వొప్పందం తప్పకుండా విజయవంతమవుతుంది — శ్రీలంక చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమై, పరస్పర మైత్రి మరింత బలపడుతుంది" - అన్నారు 'టుల్ఫ్' అధ్యక్షులైన శివచిదంబరం. మద్రాసు ప్రెస్‌క్లబ్‌లో అధ్యక్షులు డి ఆంజనేయులు స్వాగతం తెలుపగా, కార్యదర్శి శౌలి వందన సమర్పణ గావించారు.

. . . . 11

మిత్రులు డబ్లుయువి నాయుడు, రామతిలకం దంపతుల కుమారుడు చి॥ రాజేంద్రప్రసాద్‌కీ, సౌ॥ శోభనాదేవికీ ఈ ఉదయం తొమ్మిది గంటలకు రాజేశ్వరీ కళ్యాణ మండపంలో శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. పొద్దుట ముహూర్తానికీ, సాయింత్రం రిసెప్షన్‌కీ బంధుమిత్రులనేకులు వచ్చి నూతన వధూవరులను ఆశీర్వదించారు. ఎవి రమణన్ అండ్ పార్టీవారి మ్యూజిక్, విద్యుత్ కాంతుల సోయగం, విందుభోజనం.

. . . . 12

"గడిచిన శతాబ్ది ఎనభైలలో దేశవ్యాప్తమగు కాంతిని వెదజల్లిన మహనీయులెందరో జన్మించారు మద్యపాన నిషేధం, అస్పృశ్యతా నివారణ ప్రధానాంశాలుగా నమక్కళ్ రామలింగం పిళ్లై తీసుకోగా, స్త్రీజన విమోచనకై ప్రగతికై శ్రమించారు మైథిలీ శరణ్ గుప్త ఇరువురూ తమ కవితా శంఖాన్ని దేశభక్తి గానంతో పూరించారు. ఆ మహానుభావుల శతజయంతి సందర్భంగా, వారి జీవితంలోని సందేశం, వారి జీవితంలోని ఆశయ

పథం తెలుసుకోవటం ఎంతైనా అవసరం నలభై ఏళ్ల స్వాతంత్ర్యం తర్వాత మన దృష్టి మరింత సంకుచితమై, అల్పత్వాలని ప్రోత్సహిస్తున్న కారణంగా దౌర్జన్యవాదం తల ఎత్తుతోంది. ఉత్తరాన మైధిలీశరణ్ గుప్త, దక్షిణాన రామలింగం పిళ్లై ఒకే గాన విపంచి ఆలపించి స్వాతంత్ర్య సౌభాగ్యాలకు. సామరస్య సౌజన్యాలకు దోహదం చేశారనే విషయం మనం ఈనాడు గుర్తు చేసుకోవలసి వుంది" - అన్నారు తమిళనాడు గవర్నరు ఖురానా, భారతీయ విద్యాభవన్‌లో ఆదర్శ గిల్డ్ ఆఫ్ ఇండియా వారు జరుపుతున్న ఈ యిరువురు మహాకవుల శతజయంతిఉత్సవాన్ని ప్రారంభిస్తూ. మద్రాసు ఛాప్టర్ కన్వీనరు 'యస్వీయస్' ఆహూతులకు స్వాగతం తెలిపారు... "సుబ్రహ్మణ్య భారతి అడుగుజాడలలో నడిచారు రామలింగం పిళ్లై. గుప్తా, పిళ్లైలు వటవృక్షాలు. వారి జీవనసందేశం నేటి ప్రజను ప్రభావితం చేయాలి"- అన్నారు తమిళనాడు సమాచార మంత్రి స్వామినాధన్ .... "భారత స్వాతంత్ర్యోద్యమం ఎన్నో బంగారు తీగెలని వెలుగులోకి తెచ్చింది. మనదేశప్రజలలో రాజకీయ చైతన్యమూ సామాజిక చైతన్యమూ తెచ్చేందుకు, ఈ మహాకవులిద్దరూ గళం విప్పి పాడిన పాట అజరామరం....ఆనాటికానాడు మనదేశంలో సంకుచితత్వం ఎక్కువైపోతోంది. ఒక రాష్ట్రవాసి మరొక రాష్ట్రానికి వెళ్లినప్పుడు, పరాయిదేశస్థుడై పోతున్నాడు.

ఇది చాలా విచారకరమైన పరిణామం. ప్రభుత్వ కార్యాలయాలలోను, వెలుపలా కన్నడ, తెలుగు, తమిళ మరాటీ, బెంగాలీ - యిలా ఆయా ప్రాంతీయ భాషలలో బోర్డులు వుంటాయేతప్ప, యింగ్లీషులో ఉండవు. హిందీని తమపై రుద్దుతారేమోనను భయంతో ఈ ప్రాంతీయ భాషావాదం వెర్రితలలు వేసింది - వేస్తోంది రాజ్యాంగంలో సవరణ ప్రవేశపెట్టి, ఇంగ్లీషుని హిందీతో అధికార భాషగా గుర్తిస్తే తప్ప ఈ వింత పోకడలు అంతరించవు. సైన్సు, టెక్నాలజీ తెస్తున్న మార్పులని మనం వాస్తవిక దృష్టితో చూడగలగాలి. ఇండో - శ్రీలంక ఒప్పందంలో సింహళం తమిళంతో బాటు యింగ్లీషుని అధికార భాషగా చేర్చారు. అదేవిధంగా మనమూ ఈ ప్రాంతీయ భాషా వివాదాలకు స్వస్తి చెప్పాలి. వొత్తిడి లేకపోతే హిందీని ఎంతో సంతోషంగా నేర్చుకుంటారు. అధికారయుతంగా రుద్దబోతే ప్రతిఘటిస్తారు.. ఎవరి ప్రాంతీయ భాష వారు తమ లిపిలో నేర్చుకోవచ్చు. కాని మరొక భాష నేర్చుకొనేందుకు రోమన్ లిపి (ఎబిసిడిలు) ఎంతో వీలుగా ఉంటుంది ఈ నిజాన్ని ఎంత తొందరలో ఆమోదిస్తే అంత మంచిది మన దేశ సమైక్యతకు" - అన్నారు ప్రఖ్యాత నాయకులు సి సుబ్రహ్మణ్యం కెసి గౌడ్ మొదల్కు మున్నగువారు ప్రసంగించిన మీదట డి అంజనేయులు వందన ము.

. . . . 19

"స్త్రీ సేవా మందిర్‌లో 'మందిరం అనే శబ్దం 'వర్క్ ఈజ్ గాడ్' (Work is God) అనే దానికి ప్రత్యామ్నాయం కష్టంలో వున్న స్త్రీకి మనోధైర్యమూ, ఆత్మగౌరవమూ వ్యక్తిత్వమూ యిస్తూ, తన కాళ్ల మీద తమ నిలబడేటట్లు చేస్తుంది వెన్నగంటమ్మా కృష్ణారావు గారు. 1949 లో స్థాపించిన ఈ మహా సంస్థ, నెలల పసిపాపల నుంచి అరవై డెబ్భయేళ్ళ పెద్దవాళ్లదాకా స్త్రీలకీ శిశువులకీ ఈ సంస్థ చూపే రాజ మార్గం స్వయంగా చూసిన మీదట గాని తెలీదు. అదొక ప్రపంచం- 38 శాఖలుగా విస్తరిల్లిన వినూత్న ప్రపంచం. అక్కడ పని చేసేవారి ముఖాలలోని తృప్తి అనందం మీ అంతట మీరు చూస్తేగాని నమ్మలేరు ప్రతి సక్సెస్‌ఫుల్ మాన్ వెనక ఒక స్త్రీ ఉంటుందని సామెత ; అలాగే, ప్రతి సక్సెస్‌ఫుల్ వుమన్ వెనక ఒక పురుషుడు వుంటాడు - వారే అక్కడ కూచున్న కృష్ణారావుగారు" - అన్నారు జయారావు, మిసెస్ కృష్ణారావుకి ఈ సంవత్సరం బజాజ్ అవార్డ్ వచ్చిన సందర్భంగా, శ్రీనివాస శాస్త్రి హాలు ఏర్పరిచిన అభినందన సభలో. పప్పు వేణుగోపాలరావు ఆహూతులకు స్వాగతం తెలిపిన మీదట సభకు అధ్యక్షత వహించిన రమణయ్యా రాజా మిసెస్ కృష్ణారావు చేస్తున్న సేవా కార్యక్రమాలను ప్రశంసించారు. నూట పాతికేళ్ల ఆయుర్దాయ మామో కివ్వమని కపాలేశ్వరుని కోరుతూ, వృద్ధుల వసతి గృహం గురించి ఆలోచించమన్నారు బివి యస్సెస్ మణి. మిసెస్ మణి వెన్న గంటమ్మగారికి సన్మాన పత్రం సమర్పించారు , రమణయ్యా రాజా దుశ్శాలువ కప్పారు "మా నాన్నగారు అయిదో క్లాసుకి మించి చదువుకోలేదు అయితే సంఘ సంస్కరణోద్యమంతో వీరేశలింగం. రఘుపతి వెంకటరత్నం వంటి వారివల్ల ప్రభావితులై, అస్పృశ్యతా నివారణ, విద్యావ్యాప్తి, స్త్రీ పురుష సమానత్వం యిటువంటి వాటికై కృషి చేస్తూండేవారు. పూళ్ల గ్రామంలో స్కూలు స్థాపించినది మా నాన్నగారే - ఇపుడు హైస్కూలు అయింది గాని అప్పటిలో మిడిల్ స్కూలు మాత్రమే తర్డ్‌ఫారమ్ దాకా పూళ్లలో చదువుతున్న నన్ను, హైస్కూలు చదువుకి రాజమండ్రి పంపారు. అప్పట్లో లేడీస్ హాస్టల్‌కి వార్డెన్ హనుమాయమ్మగారు. పని వాళ్ల మీద ఆధారపడకుండా ఎవరి పని వారు చేసుకోవాలనే మొదటి పాఠం. సుశిక్షణకు సంబంధించిన ప్రథమ పాఠం, ఆమె వద్ద నుంచి నేర్చుకున్నాను. ఆ తర్వాత మద్రాసులో కాలేజీ చదువు, లేడీ వెల్లింగ్టన్‌లో ట్రయినింగు ; క్ష్యయమ్‌సిలో ఉద్యోగం ... దుర్గాబాయి గారు నా దృక్పథాన్ని మార్చివేశారు — ఆంధ్ర మహిళా సభ ప్రారంభమయింది ; ఆమె ఎక్కడెక్కడి నుంచో

నిధులు తెచ్చేవారు— వాటి సక్రమ వినియోగ బాధ్యత మాది ఆమె అర్గ నైజర్, మేము కార్యకార్తలం ఈ స్త్రీ సేవా మందిర్ 1949 అక్టోబర్ 2వ తేదిన, గాంధీ జయంతినాడు మైలాపూర్ చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలులో అవతరించింది, దీనికి ప్రారంభోత్సవం చేసినది దుర్గాబాయిగారే! చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు వ్యవస్థాపకురాలైన మిసెస్ ఎల్లెన్ శర్మ, తమ జర్మన్ మిత్రులు కొందరికి మమ్మల్ని పరిచయం చేశారు. అప్పటి కింకా స్త్రీ సేవా మందిర్ నిలదొక్కుకోలేదు— స్వంత భవన మంటూ లేదు— ఇప్పుడు శాలిగ్రామ్‌లో ఒకవిధంగా స్థిరపడ్డాం. జవహర్ విద్యాలయంలో మూడువేల మంది చదువుకుంటు న్నారు. అందులో రెండువేల మంది నిర్ణయించిన ఫీజు చెల్లిస్తారు; మిగతా వెయ్యి మందిలో కొందరు సగం చెల్లించీ, మరి కొందరు ఉచితంగాను విద్య నేర్చుకుంటున్నారు. ఆట బొమ్మల తయారీ, అద్దకం పనులు నుంచి, కుట్టు మిషన్, టైప్ రైటింగ్, యాన్సిలరీ పార్ట్స్ ఉత్పత్తి, కంప్యూటర్ ట్రయినింగ్ దాకా అనేక శాఖలు వున్నాయి. వృద్ధుల వసతి గృహం మా కాంపస్‌లోనే, చిన్న పిల్లలకి చేరువగా వుండేటట్లు తద్వారా ఎమోషనల్ ఇంటిగ్రేషన్ ఏర్పడేటట్లు పెడదామనుకుంటున్నాము,'' — అన్నారు మిసెస్ ఎ సి కృష్ణారావు. ప్రొఫెసరు లలిత ప్రసంగం తర్వాత, మల్లిక్ వందన సమర్పణ.

. . . . 20

కీచులాడుకు దూరమైపోయిన తల్లిదండ్రులని కలపడంలో కృత కృత్యుడవుతాడు హీరో (రమేష్), జంధ్యాల దర్శకత్వంలో నిర్మాత సుబ్బారావు తీసిన 'చిన్నికృష్ణుడు' లో కథానాయిక కుష్బు, న్యూయార్క్, షికాగో, డెట్రాయిట్, అట్లాంటా మున్నగు పన్నెండు పట్నాలలో ఈ పిక్చర్ షూటింగ్ జరిగింది రమేష్‌ది మిమిక్రీ కళాకారుని పాత్ర ఆర్‌డి బర్మన్ సంగీతం గుమ్మలూరి శాస్త్రి, ఆర్లిన్ అనే అమెరికన్ అమ్మాయీ వున్నారు. భారతి, రమేష్ తల్లిగా, యాక్టు చేస్తోంది. లాస్ ఏంజిల్స్‌లో డాన్స్ స్కూలు నిర్వహిస్తున్న విజయభాను కూడా ఇందులో ఉంది. జెమినీ కాంప్లెక్స్‌లోని పత్రికా సమావేశంలో ఈ వివరాలు తెలిపారు నిర్మాత సుబ్బారావు. దర్శకులు జంధ్యాల.

పి ఆర్ ఒ . అర్జునరావు . . మాక్స్ ముల్లర్ భవన్ కొత్త డైరక్టరు 'హాన్స్-డయిటర్ ఎమ్మర్ట్' కి స్వాగతం తెలిపేందుకుగాను, వారి స్టాఫ్, ద్వారం మంగతాయారు వయొలిన్ కచ్చేరీ ఏర్పాటు చేసారు - ఐలాండ్ గ్రవుండ్స్‌లోని స్మాల్ థియేటర్‌లో. పదిహేను నిముషాలు ముందుగా ఆశీనులు గమ్మని అభ్యర్థన. కాని, ఇరవై నిముషాలు ఆలస్యంగా ప్రారంభించారు థియేటర్ కళాత్మకంగా వుందిగాని కుర్చీలకు అలవాటు పడ్డ పట్నవాసులకి, ఆ చాపలమీద కూచో

డం కొంచెం కష్టమే! అయినా కూచున్నారు - ఆ సంగీతం పలికిస్తున్నది మంగతాయారు గనక!

..... 23

ముప్పయి మూడు సంవత్సరాల తర్వాత (నేషనల్ ఫిలిమ్ యవార్డ్స్ స్థాపించినది 1953 లో) రాష్ట్రపతి స్వర్ణపతకం అందుకున్న మొదటి తమిళ చిత్రం ఎవియమ్ వారి 'సంసారమ్ అదు మిన్సారమ్' - తెలుగు, కన్నడ, మళయాళ చిత్రాలకు లభించిన బంగారు పతకం, యింతవరకూ తమిళ చిత్రానికి రాలేదు పావమన్నిప్పు, దైవప్పిరవి చిత్రాలకు ద్వితీయ తృతీయ బహుమతులు వచ్చాయిగాని బంగారు పతకం రాలేదు. అయితే ఎవియమ్‌వారి హిందీ చిత్రం 'హమ్ పంచె ఎక్ దాల్కె' కి లోగడ వచ్చింది ... శరవణన్, బాలసుబ్రమనియన్, గుహన్, విసులను అభినందించేందుకు, తమిళచిత్ర పరిశ్రమకు లభించిన గౌరవానికి ఆనందం వ్యక్తపరిచేందుకు ఫిలిమ్ ప్రొడ్యూసర్స్ గిల్డ్‌వారు వుడ్‌లాండ్స్‌లో, తమిళనాడు సమాచార మంత్రి స్వామినాథన్ అధ్యక్షతను సమావేశం జరిపారు... తండ్రి అడుగుజాడలలో నడుస్తున్న తనయులు, సినీ మీడియమ్‌ని సామాజికోన్నతికి వినియోగిస్తున్నారు - అన్నారు టిటికె వాసు. బాలచందర్, భారతీరాజు, ఉమాపతి, లక్ష్మి మున్నగువారు ప్రసంగించారు. అవార్డ్ పైకం నలభై వేలూ ముఖ్యమంత్రి న్యూట్రిషన్ పథకానికి సమర్పించారు శరవణన్.

25

ఆదివిష్ణు 'సత్యంగారి యిల్లు' ఆధారంగా, జంధ్యాల స్క్రీన్‌ప్లేతో దర్శకత్వంతో, సురేష్ రామానాయుడు నిర్మిస్తున్న 'ఆహా నా పెళ్లంట' ప్రతి రెండు నిముషాలకీ నవ్విస్తుంది — పూర్తిగా హాస్యరసస్ఫోరక చిత్రం, రాజేంద్రప్రసాద్, రజనిలతోబాటు నూతన్‌ప్రసాద్, కోట శ్రీనివాసరావు మున్నగు కామిడియన్స్ చాలామంది వున్నారు. కేరళలో చిత్రీకరణ గావించారు. ఇందులో డ్రీమ్ సాంగ్స్ లేవు. ప్రతిపాటా యితివృత్తానికి జోడింపబడి, కథాగమనానికి దోహదకారి అవుతుంది. రమేష్‌నాయుడు సంగీతం; గోపాలరావు కెమెరా. తలిదండ్రులు తనకి అనుకూలంగా వుండే పిల్లను ఎంపిక చేయలేకపోవడం వల్ల తనకి తానుగా రంగంలోకి దిగి 'ప్రేమావతి' ని ఎన్నుకుంటాడు హీరో .... పెద్ద పట్నాలన్నిటిలోను సురేష్‌వారు డిస్ట్రిబ్యూషన్ ఆఫీసులు పెట్టారు. "పదిహేడు సంవత్సరాల తర్వాత 'ప్రేమ్‌నగర్' రిలీజ్ చేస్తే, ప్రేక్షకులు చూబుతున్న ఆదరణ విస్మయం కలిగిస్తోంది. ఏ చిత్రానికైనా కథలోని పటుత్వమే ప్రాణం పోస్తుంది - అని స్వర్గీయ చక్రపాణిగారు చూ హెచ్చరిస్తూండేవారు. కారణాలు ఏవైనప్పటికీ ఆనాటి ఏకోన్ముఖ కృషి యిప్పుడు లేదని వొప్పుకోవాలి" — అన్నారు, పాతికేళ్లలో అనేక విజయవంతమైన చిత్రాలు అనుభవజ్ఞులు రామానాయుడు,

మహల్‌లోని పత్రికాగోష్టి సందర్భంగా. పిఆర్‌ఒ. అరుణరావు రజనీకాంత్ హీరోగా (శ్యామ్‌బాబు అనే టాక్సీ డ్రయివర్), డ్వాయిట్ విటిల్ దర్శకత్వం లో అమృత్‌రాజ్, డా॥ మురళీమనోహర్ నిర్మాతలుగా 'బ్లడ్ స్టోన్' ('Blood Stone') అనే ఆంగ్ల చిత్రాన్ని నిర్మిస్తు న్నారు. కథ : నికొ మాస్టరాకిస్ ఒమెగా పిక్చర్స్‌వారు ఈ థ్రిల్లర్‌ని ప్రపంచ వ్యాప్తంగా పంపిణీ చేస్తారు పిఆర్‌ఒ. నెల్లెయ్ సుందరరాజన్.

. . . . 26

వరప్రసాద్ మొట్ట మొదట తమ హైస్కూలు వార్షికోత్సవ నాటకంలో పాల్గొని, పద్యాలు పాడటం బాగా నేర్చుకు, రంగస్థల వృత్తి కళాకారునిగా కృష్ణ దుర్యోధన పాత్రలలో బాగా రాణించి, ఒక సాంఘిక నాటకం తొంభయి ప్రదర్శనలు యిచ్చి, మురళీ మోహన్ ప్రోత్సాహంతో, సినీ సీమకు వచ్చి, 'నీడలేని ఆడది'. 'అందాల రాముడు' చిత్రాలలో బుక్ అయి, మళ్లీ కొంతకాలం అజ్ఞాతవాసంలోకి వెళ్లి పోయి, 1977 నవంబరు ఒకటో తేదీన, ఆత్మ ధృతితో తను తీసుకున్న నిర్ణయం కారణంగా నూతన్‌ప్రసాద్‌గా, పునర్జన్మ నెత్తాడు — ఈ పదేళ్లలో విభిన్న స్వభావలక్షణాలు గల అనేక పాత్రలలో నటునిగా తాదాత్మ్యం పొంద గలిగాడు. హీరోగా, విలన్‌గా, కామెడి యన్‌గా, సపోర్టింగ్ యాక్టర్‌గా నూతన్ ప్రసాద్ తను ధరించిన ప్రతి పాత్రకీ న్యాయం చేకూర్చ గలిగారు అలసట నెరుగని అంకిత భావమే ఆయనకు విజయం చేకూర్చింది. మూడు వందల చిత్రాలు పూర్తయిన సందర్భంగా మద్రాసులోని తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ అసోసియేషన్ వారు 'పామ్‌గ్రోవ్'లో అభినందన సభ ఏర్పాటు చేశారు. ఈ సమావేశంలో మూడు వందల మందైనా లేరే, — అని ఒక వక్త వెలిబుచ్చిన అభిప్రాయానికి, 'ఇది జర్న లిస్టులు జరిపిన అభినందన సభ — ఆయన (నూతన్ ప్రసాద్) పేర్లు చెప్పి, ఫలానావారిని పిలవండని చెప్పగా, వారిని మాత్రమే ఆహ్వానించాము' — అని కార్యదర్శి పసుపులేటి రామారావు సముచిత రీతిని సమాధానం చెప్పారు రావుగోపాలరావు అధ్యక్షులు. డివి యస్ రాజు యమ్మెస్ రెడ్డి. పరుచూరి సోదరులు, గొల్లపూడి మారుతీరావు, మురళీ మోహన్, కాగడా శర్మ. 'సితారా' ప్రతినిధి ప్రసంగించారు; తనింత వాడయేందుకు దోహదమిచ్చిన వారికి కృతజ్ఞతలు తెలుపుతూ, మురళీ మోహన్ తనని తీసుకువచ్చినట్లే, తను పరుచూరి బ్రదర్స్‌ని ఎలా తీసుకు వచ్చినదీ చెప్పారు నూతన్ ప్రసాద్. 'ప్రెసిడెంట్ పేరమ్మ'లో (డివియస్) నూతన్ ప్రసాద్ హీరో — కనకవర్షం కురిసిందట; అలాగే కౌముదీ వారి చిత్రంలో హీరో — ప్రింట డబ్బు కూడా రాలేదట. ఆర్థిక జయాప జయాలకు, నటునిలోని కళాత్మక విలు వలకు ఏమీ సంబంధం లేదు. ☀

సమీక్షలు **చిత్రజగతి**

## శైలజా వారి 'మదన గోపాలుడు'

అర్చకుడు రామాచార్యులు (జె వి సోమయాజులు) కుమారుడు గోపాలాచారి (రాజేంద్రప్రసాద్), కాలేజీలో చదువుకుంటూ, జీరో మార్కులు తెచ్చుకుంటూ, అక్షరాలా మదన గోపాలుడై, ఫస్ట్ మార్కు తెచ్చుకొనే రాధని, నాగేశ్వరరావుని మిమిక్రీ చేయడం ద్వారా పల్టీ కొట్టిస్తాడు. చుక్కలో చంద్రునిలా, అయిదారుగురో పది పన్నెండుగురో సిగ్గూ ఎగ్గూ మానాభిమానాలూ లేని ఆడపిల్లల మధ్య సినీ హీరోని నిలబెట్టి, వారందరూ యితని కోసం పడి ఛస్తున్నట్లుగా చూపడం, తర్వాత ఈయన గారి గ్లామరు పెంచడం, తెలుగు సినిమా సంప్రదాయం. అదేవిధంగా ఈ మదన గోపాలుని వెంట బడతారు మదవతులు, ఒక మదవతి వెంట, ఆమె 'మారుతి'లో బెంగుళూరులో గడిపి వస్తాడు గోపాలుడు; తల్లి మరణిస్తుంది; తండ్రి పట్నం వచ్చి యింటి నుంచి వచ్చిన ఉత్తరాలు తెరిచి చూసే వ్యవధి లేని, తన కుమారరత్నం కపట నాటకం తెలుసుకుంటాడు. ఆ తర్వాత పరివర్తన చెందిన మదన గోపాలుడు, ప్రాతఃకాల సంధ్యా వందనం, మంత్ర పుష్పం, పూజా విధానం యిత్యాదులు నేర్చుకు, ఆదర్శప్రాయుడైన అర్చకుడవుతాడు. ఆయుర్వేద వైద్యుని (గొల్లపూడి - రాధాకుమారి) కుమార్తె పూర్ణిమని యితనికిచ్చి పెళ్లి చేసేందుకు తాంబూలాలు పుచ్చుకోవడం తల్లి బతికుండగానే జరుగుతుంది. అయితే, కులమింటి పూర్ణిమను గాక, పడవ నడిపే గౌరిని (రమ్యకృష్ణ) చేబట్టడం యిందులోని ట్విస్ట్; పూర్ణిమను ఎవరు భంగపరిచారనే విషయం సస్పెన్స్‌తో అల్లారు. ఫార్ములా కథ — ముఖ్య పాత్రలకు జీవస్పందన లేదు. డాన్సులతో ప్రేక్షకులని సంతోష పెట్టజూశారు దర్శకత్వం: కృష్ణ మోహన్ రెడ్డి. నిర్మాత : సురేంద్రనాధ్ రెడ్డి.

## పిఎ క్రియేషన్స్ 'కృష్ణలీల'

ప్రాతఃకాల సౌందర్యానికి పరవశిస్తూ, మంచిపనులు చేయడమే ధ్యేయంగా గల ఒక కృష్ణ (కళ్యాణ చక్రవర్తి, నడిరోడ్డులో నిలిచిపోయిన ఒక పిసినారి రామయ్య (సత్యనారాయణ) యంబాసిడర్ని, ఆ పిసినారి

సోదరుడు శివం (మోహన్‌బాబు) గరాజ్‌కి నెట్టుకుంటూ వచ్చి, అక్కడ కాసిని ఫైట్లు జరిపి, అన్నదమ్ములిద్దరి మెప్పూ పొంది, అన్నగారి ఆఫీసులో, 53 ఏళ్ల నుంచీ తేలని కోర్టు వ్యవహారపు గుమాస్తాగా కుదురుకుంటాడు. మాస్టారి (సాక్షి రంగారావు) కూతురు లీలపై (రమ్య కృష్ణ, అమె వలపుల పారాణిపై, గుప్పెడుగుండెపై, విరహాల విరిజాజులపై, యితనికి మమతాను రాగం లేకపోలేదు. అనురాగం ఒక రాగం అనీ, దోర ముద్దులరుచి తెలుసుకోమనీ, ఇతని పిరికితనం పోగొట్టేందుకు ఆమె పథకాలు వేసినప్పటికీ, శుభలేఖ సుధాకర్, మోహన్‌బాబు, సత్యనారాయణల మన్మథ లీలా స్వప్నం నుంచి ప్రయాణించ వలసిన పరిస్థితి ఏర్పడుతుంది. చివరికి యువ జంట, పిసినారి వివేకోదయంతో, కళ్యాణ దంపతులవుతారు. హ్యూమర్ కొన్నిచోట్ల కృతకంగా వున్నప్పటికీ నవ్విస్తుంది. ఈ కామెడీ పిక్చర్‌కి దర్శకులు: రవి రాజా పినిశెట్టి. నిర్మాతలు : నాగేశ్వరరావు, సూరిబాబు.

## మహేశ్వరీవారి 'భలే మొగుడు'

హాని కలిగించని అబద్ధాలు చెప్పడంలో అద్వితీయుడైన కృష్ణ (రాజేంద్రప్రసాద్), కోటీశ్వరావువద్ద (సత్యనారాయణ) సేల్స్‌మాన్ ఉద్యోగం సంపాదించడంలో ఆశ్చర్యంలేదు. ఇతని కోతలూ కబుర్లూతో కంపెనీ వృద్ధిలోకి వస్తుంది. కోటీశ్వరావు నెల్లాళ్లపాటు జపాన్ వెళ్తాడు. కృష్ణగా పిలవబడుతున్న రామకృష్ణ స్థానం కంపెనీలో బలపడుతుంది. కృష్ణ తండ్రి (గొల్లపూడి) చీటాటలో వొంటిమీద బట్టలు తాకట్టుపెటే కుహనా సంగీతజ్ఞుడు; తమ్ముడు(శుభలేఖ సుధాకర్), చిరంజీవి చిత్రంమొదటి రోజునహారతు లిచ్చి స్వీట్లు పంచిపెట్టేందుకు చేతివాచీ తాకట్టుపెట్టే పిఫ్త్‌ఫారమ్ ఫెయిల్డ్ సినీ అభిమాని , తల్లి (అన్నపూర్ణ) ఈ సంసారం నెట్టుకొస్తున్న అమాయకురాలు. ఒక కోటీశ్వరుని కుమార్తె 'మొగుడు కావలెను' అని పత్రికా ప్రకటన వేయగా దరఖాస్తుదారులతో ఒకనిగా ఈ కృష్ణ వెళ్లి, తనది ప్రపంచ వ్యాప్తమగు బిజినెస్ అనీ, ఇవాళ టోక్యోలోవుంటే రేపు లండన్, ఎల్లుండి న్యూయార్క్ అనీ, తన తండ్రి పారిస్‌లో పాటకచ్చేరీలు చేస్తాడని తమ్ముడు ఐఎయస్ అనీ, తల్లి అంతర్జాతీయ మహిళా మండలి అధ్యక్షురాలనీ, మూడురోజుల క్రితం తన బెంజ్‌కారు ఫ్రెండ్‌కి దానంచేశాననీ ఇలా ఒక అందమైన అబద్ధాల వల అల్లగా, ఆ చేప యిట్టే అందులో పడుతుంది. అయితే, ఆ అమ్మాయి తన యజమాని కూతురవడం, ఆ యజమాని యితని అబద్ధాలని సమర్ధించి కూతురు మెళ్లో మూడు ముళ్లూ వేయించడం, చుట్టూ అల్లబడిన అబద్ధాల కోటలో తను బందీ అయానని సీత తెలుసుకోవడం, కృష్ణలోని నిజాయితీ దృఢత్వం దంపతులని కలపడం ఈ హాస్యవల్లరిలోని

ప్రధానాంశాలు. రాజేంద్రప్రసాద్‌నటన ప్రశంసనీయం, రజని బాగాచేసింది. కిన్నెరది చిన్న పాత్ర అయినా బావుంది. దర్శకులు రేలంగి నరసింహారావు నవ్వులు పంచి పెడతారు నిర్మాత వెంకన్నబాబు

## యువచిత్రావారి
## శ్రీనివాస కళ్యాణం

శ్రీనివాసుకి ఏడేళ్లు, చెల్లెలుకి, మేనత్తకూతురు సరోజకి అయిదారేళ్ల వయసున్నప్పుడు పొలంనీటి తగాదాలో ఖామందుని రక్షించే నిమత్తం ప్రాణాలు కోల్పోతాడు శ్రీనివాసు తండ్రి, ఆ దారుణహత్య చూసిన తల్లి, తట్టుకోలేక విరుచుకుపడి చనిపోతుంది. ఖామందు శ్రీధరరావు పిల్లలని పెంచి పెద్దవాళ్లని చేసేందుకు, శ్రీనివాసు మేనత్త భర్తకి డబ్బిస్తాడు ఆ తాగుబోతు ఈపిల్లలిద్దరినీ మరెవరికో అమ్మేయగా తండ్రి కుతంత్రం తెలిసిన సరోజ, బావనీ వొదిననీ కాపాడేందుకు, యింట్లో నుంచి కొంతడబ్బు పట్టుకొచ్చి, పట్నం పారిపోయేందుకు మూడు టికెట్లు కొనమంటుంది. రైలు కదిలే వేళకి ఆ అమ్మాయి, స్టేషన్ చేరుకోలేక పోతుంది ; ఎంచేతననగా బండి ఆసామీ తల బద్దలు కొట్టిన కారణంగా ! పోలీసులు ఆ పిల్లని పట్టుకుంటారు అది పూర్వరంగం . పిల్లలు లేని స్టేషన్‌మాస్టరు (గొల్లపూడి) యింట్లో శ్రీనివాసూ (వేంకటేష్), అతని చెల్లెలూ (రాజ్యలక్ష్మి) పెరిగి పెద్దవాళ్లవుతారు. ఉత్సాహవంతుడూ అయిన శ్రీనివాస్, పేపర్ బాయ్‌గా, ఆటో డ్రవరుగా, హొటల్ సర్వరుగా, నర్తనశాలలో డాన్సరుగా సినీహీరో చేయవలసిన పనులన్నీ చేస్తూ, తనకొచ్చే ఉద్యోగం లలితకు (భానుప్రియ) త్యాగం చేసి, ఆమెని వాళ్ల బావ దుర్బుద్ధి నుంచి అనేక సార్లు కాపాడుతాడు పదేళ్లు (గౌతమి) బోర్స్టల్ స్కూలులో గడిపిన సరోజ, అదే స్టేషన్ మాస్టర్ అవుట్ హవుజ్‌లో అద్దెకి దిగుతుంది. ఇద్దరమ్మాయిలు ఒక అబ్బాయి కథ అయినప్పటికీ, స్ఫటికంలాటి మనసు గల ఈ యిరువురిలోను వ్యక్తిత్వం కనిపిస్తుంది పరమేశ్వరీ హొటల్ ప్రొప్రయిటరైన కళా బంధు పాత్రని మోహన్ బాబు చాలా చక్కగా పోషించాడు. గౌతమి సూటి మాటలు కలవరపెడతాయి; చూపులు గుండెల్లో గుచ్చుకుంటాయి ; సంగీత సాహిత్యాలు ఈ చిత్రానికి పుష్టినీ పరిమళాన్ని యిస్తున్నాయి: దర్శకత్వం: కోడి రామకృష్ణ. నిర్మాత. మురారి





బోటని (వృక్షశాస్త్రం) అనగా అందమైన పువ్వుల్ని నోరుతిరగని గ్రీకు, లాటిన్ పేర్లతో పిలిచి అవమానించటం. —అల్ఫాంజోకార్

మానవుని మెదడు చాలా గొప్పది. పుట్టినప్పట్నుంచీ అది విరామం లేకుండా పనిచేస్తూ వుంటుంది — ఒక్క క్షణం కూడా ఆగదు, ఉపన్యాసం యిచ్చేందుకు వేదిక ఎక్కినప్పుడు తప్ప !

—హాఫ్‌మాన్

# ముఖచిత్రం




తెలుగు సినీ జగతిలో గృహలక్ష్మి, వాహినీ వారి వందేమాతరం, ఆ తర్వాత యిప్పటికీ మర్చిపోలేని మల్లీశ్వరి మైలురాళ్ళ వంటివి అన్నగారైన 'బియన్' వెండితెర పందిరిలో వెలుగులు ప్రసరిస్తూండగా, తమ్ముడు నాగిరెడ్డి, చక్రపాణి సంబాలకునిగా స్థాపించిన చందమామ (తమిళంలో అంబులిమామ) ప్రతియింటా కధలూ కారుణ్యాలూ విరజిమ్ముతూండేది. నాగిరెడ్డి - చక్రపాణి ద్వయం తెలుగు పాఠకలోకానికి, సినీ ప్రేక్షకలోకానికి ఒక అపూర్వమైన జంట. విజయావారి 'షావుకారు' విజ్ఞుల మెప్పు పొందింది – కాని, పాతాళభైరవి యావన్మందినీ అలరించింది. పెళ్లి చేసి చూడు, మిస్సమ్మ – వరసనన్నీ విజయపరంపరవే! 'విజయ - వాహిని' దక్షిణ ఆసియాలో అత్యుత్తమ స్టుడియో అయింది. తెలుగు తమిళాలలో ప్రారంభమైన 'చందమామ' పధ్నాలుగు పదహారు భాషల ఎత్తుకి ఎదిగింది. మాకు తెలిసినంతలో యావద్భారతంలోనే కాదు, ప్రపంచం మొత్తం మీద రీడర్స్ డైజస్ట్ తర్వాత, యిన్ని భాషలలో ఒకే మాతృక నుంచి వెలువడుతున్న పత్రిక చందమామ ఒక్కటే! కడప జిల్లా పత్తింపాడు గ్రామంలో జన్మించిన ఒక వ్యక్తి, సర్వ సామాన్యమైన విద్యా వినయ సంస్కారాలతో, ఆత్మ సంయమనంతో రామకృష్ణ పరమహంస, వివేకానందులు దారి చూపగా, ప్రాపంచిక వ్యవహారాలలో యస్సెస్ వాసన్, శాంతారామ్ ఆదర్శ మూర్తులు కాగా ఆరుకోట్ల ఆంధ్రులు ఘనంగా చెప్పుకోగల 'విజయ' సౌధం నిర్మించారు. 'నిలుపరా నీ జాతి నిండు గౌరవము' అని చెప్పిన రాయప్రోలు మాటను నిజం చేశారు. విజయా గార్డెన్స్ కానీయండి, విజయా హాస్పిటల్ కానీయండి, విజయ - వాహినీ స్టుడియో కానీయండి, విజయా శేష్ మహల్ కానీయండి – యిలాటి వింకెన్నో నాగిరెడ్డిగారి నిర్మల హృదయానికి, నిశ్చలదీక్షకు, సమిష్టి కృషికీ, సామూహిక క్షేమానికీ మచ్చుతునకలు. కళైమామణి, డాక్టరేట్ వంటి బిరుదులు గౌరవాలు ఎన్నో ఆయన్ని వరించాయి. – ఈ సంవత్సరం పాల్కె యవార్డ్ నాగిరెడ్డిగారు నిగర్వి, నిరాడంబరుడు, నిరంతర పథికుడు, నిర్మలాంత రంగుడు అని ఆయనతో ఏ కొద్దిపాటి పరిచయమున్న వారైనా వొప్పుకుంటారు. 'నిశ్చితార్థంబు వదలని ఈ నిపుణమతి' కర్మణ్యేవాధికారస్తే, మా ఫలేషు కదాచన' అనే గీతాసూక్తిని నమ్మిన కర్మయోగి.

# 'ప్రతి గురువారం'

గడిచిన కథ: మెక్లవిన్ దంపతులు 'ఆర్కయివ్' అనే వారపత్రిక కొన్నారు స్వంత ప్రెస్ లేదు ఒక పెద్ద మనిషి వారం వారం ప్రింట్‌చేసి పెడతానన్నాడు. 'హమ్మయ్య - బతికాం' అనుకున్నారు ఆ దంపతులు కష్టాలన్నీ ముందున్నాయని వారికి తెలియదు..

ఇక చదవండి

స్వవిషయం (Strictly Personal)

"ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఫలానా పని చెయ్యక తప్పదనీ నీకు అనిపిస్తే, ఆ పనేదో చేసేయ్. విజయం (Success) నిన్ను ఆ మార్గంలోనే వరించవచ్చు."

కాలేజి చదువు అయిపోయి, బయటికొచ్చాక, ఒక పెద్ద మనిషి నాకు చెప్పిన సలహా అది. నేనప్పుడు శిల్పకళ అభ్యసిద్దామనుకుంటున్నాను. మూడేళ్ళపాటు చదవాలి. ఆ మూడేళ్లూ నన్ను నేను పోషించుకోవాలి. "ఎన్ని అవాంతరాలు వచ్చినా శిల్పిని అవడం నా గమ్యమా?" - అని నన్ను నేను ప్రశ్నించుకున్నాను. 'కాదని తోచింది.

అప్పటికీ యిప్పటికీ మధ్య చాలా సంవత్సరాలు గడిచాయి. ఎన్నో అనుభవాలు, ఎంతో జీవితం - కాలం వృథాగా దొర్లిపోయిందని చింత పడనవసరం లేదు. యుద్ధకాలంలో సముద్రం మీద ఉన్నప్పుడు ఎన్నో రాత్రిళ్ళు ఒకే కోరిక నన్ను వేధించేది. ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఆ ఆశయం కార్యరూపం దాల్చాలని అనిపించేది; చిన్న పత్రిక ఒకటి నిర్వహించాలనే తీవ్రతరమైన కోరిక అది.

మాదింకా ప్రారంభదశే, ఎన్నో అవాంతరాలు రానున్నాయి. భవిష్యత్తు పట్ల నమ్మకముంచడమే మానవులమైన మనం చేయగల పని. మీలో కొందరు నాకు చేయూత నివ్వడానికి అంగీకరించారు. మీరు నా మీద ఆవిధంగా వుంచిన విశ్వాసాన్ని నిలబెట్టుకునేందుకు సర్వదా కృషి చేస్తాను.

ఇటువంటి చిన్న వార పత్రిక తన పాఠకులకి స్థానిక వార్తలనీ, స్థానిక విశేషాలనీ అందజేయాలి. నిష్పాక్షిక దృష్టితో వార్తా సమీక్ష లందజేస్తాం దని మీ అందరిచేత అనుపించుకోవడమే నా ఆశయం.

సంపాదకీయంలో పత్రిక అభిప్రాయం ఉంటుంది. చందాదారులకీ ప్రకటనదారులకీ భయపడే పత్రిక, ఏ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా చెప్పలేకపోతుంది. డవునింగ్ టవున్ లోని ప్రజలందరి క్షేమం కోసం ఈ పత్రిక పాటుపడుతుంది. అది చిన్న

విషయం మనుకునేరు ! కాదు, చాలా పెద్ద విషయం సంపాదకీయం వున్న పేజీలలోనే సంపాదకలేఖలు (Letters to the Editor) కూడా ఉంటాయి. ఏదైనా సంపాదకీయం మీకు బావుండకపోతే, సహేతుకంగా విమర్శిస్తూ సంపాదక లేఖ రాయవచ్చు. ఏ విషయాన్నయినా సరే, అన్ని దృక్పథాల నుంచీ చర్చించడమే పత్రికా ధర్మం. పత్రికలు ప్రజాసామ్యానికి పట్టుగొమ్మలు

స్వంత లాభం కోసం గానీ, ఎన్నికల కోసం గానీ నేను ఈ పత్రికని ప్రారంభించ లేదు. రోజుకి పన్నెండు నుంచి పదిహేను గంటలదాకా ఈ పత్రిక కోసం నేను కష్టపడక తప్పదు. చందాదారులుగా చేరమనో, ప్రకటనలు యివ్వమనో మీ అందరి దగ్గిరికీ నేను వస్తాను. మాకు లాభాలేమీ అక్కర్లేదు గాని, నేనూ నా భార్య ఈ పత్రిక మీద బతకాలి. మా జీవనోపాధికి శ్రమపడుతూ, మీకు చక్కని విషయాలు వారం వారం అందించగలమని ఆశిస్తున్నాం. — రాబిన్సన్ మెక్లవిన్

మా మొదటి సంచిక ఎనిమిది పేజీల పత్రిక, పేజీకి ఆరేసి కాలమ్స్, పత్రిక బయటికొచ్చాక, మళ్ళీ ఒకసారి చదువుకునేటప్పటికి అచ్చు తప్పులు భయంకరంగా కనిపించాయి. పేజీ ఏమీ బావుండలేదు, ఒక తలకిందులుగా పడింది. అయినప్పటికీ, కాకి పిల్ల కాకికి ముద్దులా ఆ పత్రిక మాకు ప్రపంచంలోని అన్ని పత్రికలలోకి అందమైనదిలా కనిపించింది. కొన్ని నెలల అనిశ్చయతా, ఆ ఆందోళనా పోయాయి. ఒక దారిలో పడ్డాం. చేసేందుకు ఒక పని అంటూ వుంది. పత్రిక బయట పడే మొదటి రోజున, నాకు పురిటి గది జ్ఞాపకం వచ్చింది గంటల కొద్దీ ప్రెస్‌లో నుంచో లేక కాళ్ళు బలపాలు కట్టాయి పాదాలు వాచాయి కామెర్ల వల్ల బాబ్ యింకా నీరసంగా ఉన్నాడు. ఆఖరి ఫారం మిషన్ మీదకి వెళ్ళేటప్పటికి అతను తూ లు తు న్నా డు. ఏమయితేనేం, సాధించాం - ఆర్కయివ్‌ని మార్కెట్లోకి తీసుకువచ్చాం.

అతను మొదటి సంచికలోని 42 అచ్చుతప్పులూ చూసుకు విచారిస్తూండగా అన్నాను : "నా పేరు లేదేం పత్రిక మీద ?"

కనురెప్పలు పైకెత్తి అన్నాడు : "ఎడిటర్ పని నీకేం తెలుసు - నీపేరు వేసేందుకు ? పేజీ మేకప్ నుంచి డిస్పాచి వరకూ సమస్తం నీకు తెలిసే దాకా, నీపేరు వేయడం పడదు."

భర్తకి తోడునీడగా ఉండటమంటే ఏదో అనుకున్నాను. చాలాదాకా వుందే ! - అనిపించింది

నెలరోజులు అనంతరం నాకు అవకాశం లభించింది. బాగా అలిసిపోయి, 102 డిగ్రీల టెంపరేచరుతో బాబ్ పక్కమీద వున్నాడు.

"ఇలా నేను పక్కమీద పడుకుంటే ఎలా కుదురుతుంది ? పత్రిక బయటకి తీసుకురావాలి" అంటున్నాడు బాబ్ మొండిగా.

"పత్రిక ఎందుకాగుతుంది ? నేను ఉన్నానుగా" అని ధయిర్యం చెప్పాను.

ఇన్నాళ్ళబట్టీ వాళ్ళమ్మగారి యింట్లో ఉంటున్నాం. ముందు మేము వుండేందుకు ఒక యిల్లు కావాలిగా ! నానాశ్రమపడి యూనివిల్లిఫారంలో ఒక యిల్లు సంపాయించాము. అది డవునింగ్ టవున్‌కి 14 మైళ్లూ, హనీబ్రూక్‌కి 27 మైళ్లూను సగం సామాను అక్కడికి చేర్చామో లేదో, బాబ్ జబ్బుపడ్డాడు. అతన్నేమో వాళ్ళమ్మగారి యింట్లో మిద్దెమీద ఉంచాను, అబ్బాయిని ఒక స్నేహితులింట్లో దిగబెట్టాను. కత్తి చేతపుచ్చుకుని, తెల్లగుర్రం ఎక్కి తిరుగుతున్న మధ్యయుగపు ప్రభువులా, యిక్కడికి అక్కడికి అని లేకుండా, కీట్స్‌విల్లి, డవునింగ్‌టవున్, వెస్ట్ ఛెస్టర్ ప్రాంతాలు యడ్వర్టజ్‌మెంట్లకని పూర్తిగా గాలించేశాను. నాకప్పటికి అయిదు నెలలూ వెళ్ళాయి ; మా అమ్మాయి యింకో మూడునెలల్లో పుడుతుంది. నా ఆకారం, నన్నూ చూసి ప్రజలు ఆశ్చర్యపోయివుంటారు

స్థానిక వర్తకులు వారి వారి ప్రకటనలని దగ్గర్లో వున్న రెండు దినపత్రికలకీ పంపిస్తున్నారు. పెద్ద గోడని గుండుసూదితో పడగొట్టడంలా అనిపించింది. —పత్రికకి వారి దగ్గిర్నుంచి యడ్వర్టయిజుమెంటును సంపాయించడం ! ఆ వర్తకులలో చాలామంది అర్కయివ్ పత్రిక పేరే వినలేదు యింతవరకూ.

గర్భిణీస్త్రీ వచ్చిందని చాలామంది కనికరించి వుంటారు ఈవిణ్ని వొదిలించుకోవడమెలా అని, చాలామంది తమ మొదటి ప్రకటనలు యిచ్చారేమో !

బాబ్ పక్కమీద వుండి ఒకటే గొడవ ! "కవున్సిల్ మీటింగు, రోటరీ క్లబ్, మహిళాసమితి, యుద్ధ సైనికుల సంఘం యివేమీ మర్చిపోకు, నాకు తెలుసు నువ్వంతా కలగాపులగం చేస్తావ్ !"

"మనిషి లేకపోతే నడవని సంస్థలు సంస్థలే కాదు" అని అతన్ని సముదాయిస్తూ, అదరా బాదరా వీధిలోపడ్డాను.

హాండిల్‌బార్ లేని సైకిల్ తొక్కుతున్నట్టు వుంది నాపని - ఆరాత్రి పేపరుప్రెస్‌కి వెళ్తున్నప్పుడు స్నేహితులింట్లో వున్న అబ్బాయిని, వాళ్ళ అమ్మగారింట్లో దిగవిడిచాను. అక్కడనుండి వాణ్ణి యూనియన్ విల్లి తీసుకొచ్చి, మరొకళ్ళ యింట్లో వుంచాను అక్కడ నుంచి హనీబ్రూక్ పరిగెత్తాను మా కారులో. సన్న సన్నటి గాలీ ప్రూఫులు పేజీరూపం ఎలా దాలుస్తాయో నాకు పాలుపోవడం లేదు - మహా గందరగోళంగా ఉంది. మార్టిన్ లియాండిస్ నాకారోజున ఎంతో సహాయం చేశాడు. ప్రూఫులు ఎలా దిద్దాలో దగ్గిరనుంచి, ఫారం కట్టడం దాకా నేర్పాడు.

పత్రిక పూర్తయేటప్పటికి అర్ధరాత్రి దాటింది అన్నీ చెప్పినట్లు చేశానా, లేక ఏమయినా మర్చిపోయానా అవి బుర్రగోక్కుంటున్నా నా ప్రథపు టుంగరం యింకా చిటికిన వేలుకే ఉంది. ఏదో ....

మర్చిపోయా నన్నమాట జేబుల్లో చేతులు పెట్టుకుని తడుముకుని, ఒక కాయితం బయటకి తీశాను నాలుగు అంగుళాల యడ్వర్టయిజ్‌మెంటు - కొత్త యడ్వర్టయిజర్ యిచ్చాడు. నాలుగంగుళాలంటే, అంగుళానికి 30 సెంట్లు చొప్పున ఒక డాలరు యిరవై సెంట్లు నష్టపోయామన్నమాట. కిరాణా కొట్టు బాకీ కొద్దిగా అయినా తీరివుండేది బాకీమాట అటు వుంచి, ఆ యడ్వర్టయిజర్‌కి ఏం సమాధానం చెప్పేది ? కాళ్ళు తేలిపోతున్నాయి ; తల తిరుగుతోంది, కళ్ళు మండుతున్నాయి, నాకు తెలియకుండానే కన్నీళ్ళు కారుతున్నాయి. ఎడిటర్ పని ఈ జన్మకి చెయ్యలేనని అనుకున్నాను.

ఆ పైవారం నేను బయటికి కదలడానికి వీలులేక పోయింది. సామానంతా పూర్తిగా యూనియన్ విల్లికి చేరవేశాం. బాబ్ యిటు డవునింగ్ టవున్‌లోనో, అటు హనీబ్రూక్‌లోనో. మధ్యని యూనియన్‌విల్లిలో నేను. ఆ రోజుల్లో మాదో సంసారమా - ఎగిరే కాగితపు బంతుల్లా వున్నాం గాని! ఇంతలో మియా జన్మించింది.

పత్రిక వెలువడవలసిన రోజునే అదీ పుట్టింది.

మరుసటివారం మా అమ్మాయి జననవార్త వేస్తూ కంపోజిటర్ అన్నాడు. "అసలు ఆ అమ్మాయి 'యింపోజింగ్ స్టోన్' మీద పుట్టి వుండాల్సింది."

నేను పురిటి గది నుంచి బయటికి రావడం, బాబ్ ఆ వారం పత్రిక పుచ్చుకు ప్రత్యక్ష మవడం రెండూ ఒకేసారి జరిగాయి.

నవ్వుతూ పత్రిక నా మీదికి విసిరాడు

ఎడిటోరియల్ పేజీ చదువుకున్నాను. ఇలా వుంది.

### మళ్ళీ - స్వవిషయం

పురుషులు తాము స్త్రీలకంటె జ్ఞాన సంపన్నులమని అనుకోవడం సర్వ సహజం. స్త్రీ పురుషులు సమానులని న్యాయచట్టం అనవచ్చు ; కాని పురుష జాతి ఆ విషయాన్ని అంతర్యంలో నమ్మదు. తను అధికుణ్ణి అనుకోవడం వల్లనే పురుషుడు జీవించగలుగుతున్నాడు. అదే అతనికి జీవగర్ర. ఆ విశ్వాసం పోయిననాడు అతను రాణీ సాహెబా వారి సేవకుడవుతాడు ; మనందరం జాలిపడవలిసిన వాడవుతాడు. భార్య చెప్పుచేతలలో మెలిగే దద్దమ్మ అవుతాడు, అంటే చేతకాని వాడన్నమాట.

తెలివిగల స్త్రీ తన భర్తను దద్దమ్మ కానివ్వదు. పురుషుని అహాన్ని కాపాడుతూ, తను తరుచు అసహాయురాలిగా కనపడుతుంది. ఈ అసహాయురాలిని రక్షించేందుకు పురుషుడు పరిగెడుతాడు. ఆమెకి కావలసిన సలహా యిస్తాడు. ఈ స్త్రీకూడా రాణీలాంటిదే ఇటువంటి రాణిని సంతోష పెట్టేందుకు పురుషులు ఎంతైనా సేవజేస్తారు ; కాని ఆ సేవలో అనురాగం ఉంటుంది.

(ఇంకా వుంది)



"సముద్రంలోకి నీటి బొట్లవలె మన మొకరితో నొకరం పూర్తిగా
కలిసి పోదాము సముద్రపు నీటి బొట్లు విడివిడిగా ఉంటే అవి
ఎండిపోతాయి అవే సముద్రంలో ఒకదానితో నొకటి పూర్తిగా
కలిసిపోయి ఉన్నప్పుడు ఎంతటి పెద్ద నౌకలనైనా అవి తమ మధ్య
నుంచి తీసుకు పోతాయి సముద్రం వలెనే అది మనకూ వర్తిస్తుంది
వది కూడా ఒక మానవ మహా సాగరమే కదా"

# సముద్రపు నీటి బొట్ల వలె కలసి మెలసి మనం ఉందాం



**JAGATI Telugu Monthly - Vol. 34 No. 377 - Dec 87**
**Edited, Printed and Published by N. R. Chender at**
**MANASA PRESS, 2 Kutchery Road, Madras- 600 004**
**Phone. 76697**